# శ్రీ భర్తృహరి నిర్వేదము.

ప్రబంధము.

---

అనువాదకులు

---


శ్రీ అనుముల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు

రిటైర్డు పండితులు.


---


రాయలసీమ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

హక్కులు గ్రంథకర్తవి
500 ప్రతులు

1945

వెల 0—12—0

శ్రీరస్తు.

# పీఠిక.

నా రచించిన భర్తృహరినిర్వేద మను నీ తెలుఁగు ప్రబంధమునకు సంస్కృతభాషలో నున్న యీ పేరు గల దృశ్యప్రబంధము మూలము. కాని యిందు శ్రవ్యరీతికి వలసిన మార్పు లన్నియు నేను స్వయముగాఁ గావించినవై యున్నవి. ప్రథమాశ్వాసముయొక్క ప్రారంభమునందును ద్వితీయాశ్వాసముయొక్క చివరను గొన్ని పద్యములు నే నెక్కుడుగా వ్రాసి యున్నాను. ఇంత దక్కఁ దక్కిన నా కావ్య మంతయు మూలానుసరణమే యై యున్నది. అయినను నే నీ యనువాదమునందు మూలములోని భావమును మాత్రము వదలక నా దొక ప్రత్యేక మైన యాంధ్ర కావ్యము వలె నుండఁ గోరియే నాశక్తి కొలఁదిని బ్రయత్నించితిని. ఈప్రయత్నములో నే నెంతవఱకుఁ గృతార్థుఁడ నైనదియుఁ బాఠకలోకమే నిర్ణయింప వలసి యున్నది.

సంస్కృతమునం దీ కావ్యమును రచించిన కవి హరిహరోపాధ్యాయుఁడు. ఈ నాటకము బొంబాయి నిర్ణయసాగరముద్రాయంత్రమున ముద్రితమై మనయాంధ్రదేశమునఁ గొంతవఱకును వ్యాప్తిఁ జెందినది. అందుఁ గవిని గూర్చి పరిష్కర్తలు వ్రాసిన పరిచయవాక్యము వలన నతఁడు మిథిలాదేశవాసి యనియు నాతని కాలము మాత్రము నిర్ణయింపబడ లేదనియు,నాయన రచించిన సుభాషిత మొకటి మిథిలాదేశమున వాడుకలో నున్నదనియుఁ దెలియుచున్నది. ఇంతకు మించి మన మాయన వృత్తాంతముఁ దెలిసికొను నవకాశ మొండేమియుఁ గానరాదు.

సుభాషితకర్తయై ప్రసిద్ధి చెందిన భర్తృహరి మగధదేశాధిపతి యను నైతిహ్యమును బట్టి నేను నాగ్రంథావతరణమునం దతఁడే యీకథానాయకుఁడై యుండు నను భావమున నట్లు వర్ణించి యున్నాఁడను. మూలములో నా రాజు తన దుస్స్వప్నదోషపరిహారము కొఱకు గంగాతీరమున శాంతిక్రియలు గావించె ననుటకంటె నింతుల కాధార మేమియు లేదు. తద్ధర్మపత్ని యైన భానుమతీదేవి మాత్రము కాశీరాజపుత్త్రి యని మూలమున నె స్పష్టముగా నున్నది. సంస్కృతవాఙ్మయములో నీ భర్తృహరినామము మిగులఁ బ్రసిద్ధి చెందినది. వ్యాకరణవ్యాఖ్యాతలలో నొకఁడు

భర్తృహరి; సుభాషితశతకత్రయకర్త యొక భర్తృహరి; బ్రహ్మసూత్రవ్యాఖ్యాతలలో నొక భర్తృహరి గలఁడు. విక్రమార్క మహారాజుయొక్క కనిష్ఠభ్రాతగా నొక భర్తృహరి చెప్పఁబడి యున్నాఁడు. ఈ యందఱియేకత్వభిన్నత్వములను గూర్చి యెవ్వరును నొకనిర్ణయమునకు వచ్చి యుండలేదు. కావున నీ నాటకకథానాయకుఁ డైన భర్తృహరి యొకానొక దేశమునకు రాజనుటకంటె, మన మెక్కుడుగా నిర్ణయింపఁ గలది యేమియునుండదు కథయొక్క యాథార్థ్యము సైత మింతకంటెఁ నెక్కుడుగా దెలియఁ గల సాధనములు గానరావు.

వేదాంతము తొల్లి స్వధర్మానుష్ఠానము నెడఁ జిత్తస్థైర్యము చేకూర్చుటకును ఫలాభిసంధివర్జనమునకును మాత్రమే యుపయోగపడు చుండినది. ఈవలీవల నిది సర్వకర్మసన్న్యాసమునకు ముఖ్యసాధనముగాఁ బరిగణించినది కావున నీ గ్రంథకర్త యీ మార్గమునే త్రొక్కి యున్నాఁడు చతుర్థపంచమాంకములందుఁ బాత్రౌచితిని సైతము లెక్కింపక కవి కర్మవాదఖండనమును మిక్కిలి విపులముగా సాగించి యున్నాఁడు అది యెంతయు నా తృతీయాశ్వాసములోఁ గాన నగును.

నేనీ కావ్యమును రచించి యేఁ డెనిమి దేండ్లు గడచినవి నా యవసతలను బట్టి దీని ముద్రణమున కింత కాలము పట్టినది. ఇందుల కైన వ్యయ మంతయు నా ప్రియశిష్యుఁ డైన యొక రెడ్డి యువకుఁడు భరించి తన పేరును సైతము ప్రకటింప నిచ్చగింపఁ డందున నా సుకృతిని గూర్చి యెందు పలుకఁ జాల నైతిని. అట్టి యా యవ్యాజదానశీలునకు నాయురారోగ్యభాగ్యముల నిచ్చి నిరంతరంబు రక్షింపఁ బరమేశ్వరుని బ్రార్థించు చున్నాను ఈ కావ్యనిర్వహణమునందు నిరంతరనిమగ్ను లైన నా మిత్త్రులు వి. శేషయ్యగారికిని దీని ప్రూఫుల రక్షగా మొదలగు కృత్యములలో నసాధారణ శ్రద్ధ వహించిన నా మేనల్లుఁడు చి॥ చెన్నుభట్ల వెంకటకృష్ణశర్మకును నా యాశీర్వాదములతోడి కృతజ్ఞతను దెలుపు చున్నాను.

ఇట్లు బుధవిధేయుఁడు.

కర్నూలు. } అనుముల వెంకట సుబ్రహ్మణ్య శాస్త్రి

శ్రీశారదాయైనమః.

# భర్తృహరి నిర్వేదము.

## ప్రథమాశ్వాసము

ఉ॥ శ్రీ లోనఁగం గలాఁ డపమశీలుఁడు మాకు, నతంబు సన్నుతిం
గాల్రిలు; రమాకళత్రుని జగత్ప్రభుఁ జేయు, మదాంధుఁ బద్మజుం
దోలి కరాంగులిన్ శిరము ద్రుంచిన సమర్థుఁడు, డంగివైరి, శ్రీ
శైలవిహారి, మృత్యుభయ,సంహృతికారి పురారి ప్రీతుఁడౌ॥ 1

వ॥ అని సకలబ్రహ్మప్రార్థనంబు గావించి మనంబున.

చ॥ శిరమున నిద్ధ జాహ్నవియు శీతకరుండు యదీప్తతాపభీ
భరమునఁ గ్రిందికిన్ డిగరు, ప్రాణముపోకకుఁ జెన్నసాబు దా
సరగున మ్రింగ యత్నయవశంబునఁ గుత్తుక దాటు, దక్షయా
హరుని సతీవియోగశిఖ నార్పఁగలట్టిది శాంతియే కదా॥ 2

సీ॥ బహుజన్మమరణవిభ్రమవిచిత్రంబైన
సంసారమున లబ్ధజన్మ మగుచు
నిజదీపకాన్వితైశ్వర్యసుఖమైన
యాలంబనశ్రేణి నాశ్రయించి
యాపాతమధురిమ వ్యామోహ హృదయుఁడై
పొగడు మూర్ఖులతోడి పొత్తుఁ గాంచి
పరికటవైరస్యపర్యవసానమై యున్న
తనదు గుట్టుకకొంత దాగురించి

గీ॥ యుంతుఁబో రసాఖ్య నొప్పుచు శృంగార
మాదిగాగ ఘనికమైన రసము
దాన నేమి? రసము తాన బ్రహ్మద్వైత
సత్సుఖాత్మకంబు శాంతరసము॥ 3

మ॥ విమలోదాత్తమనీష భర్తృహరినిర్వేదంబు నా దృశ్యకా
వ్యము సంప్రీతి రచించె ము[illegible]కృతో
త్తముఁ డా శాంతరసప్రధాన మగు సత్కావ్యంబు శ్రవ్యప్రబం
ధముఁ గావించెద నాంధ్రభాష నిజవాగ్ధాటీపటీయస్స్ఫూర్తిన్ । 4

## —♦ కథారంభము ♦—

సీ॥ కలమాదిసస్యసంకలితనానాక్షేత్ర
విహరమాణరమాసువిభ్రమంబు
కలకంఠశుకశారికా శిఖావళినిత్య
కలకలాకులకేలికాననంబు
బహుగోసహస్ర సంపత్సమాకీర్ణగో
చరశాలిగిరిపాలసంభృతంబు
కలహంససారసక్రౌంచ కోకానేక
చారుకాసారవాఃపూరయుతము

గీ॥ మదకలమహోక్షపటుతరామర్దకేలి
కలితకూలంకషాతటాంచలధరిత్రి
మగధదేశంబు సతతసమ్మోదమనోజ్ఞ
సాధుజనసన్నివేశమై జగతి నొప్పు । 5

వ॥ అమ్మహావిషయంబు బహువిషయసంపన్మనోహరంబును గంగాతరంగిణీతరంగ రంగచ్ఛీకరాహరణ శీతలవాతోద్ధూతనానాలతాకుసుమ విసర ధూళిధూసరిత వీథీవిటంకంబును హృష్టపుష్ట జనసమాకీర్ణంబును నైన పుష్పపురంబు రాజధానిగా. 6

క॥ అసదృశధీవిభవుం డ
వ్యసనపరాయణుఁడు భర్తృహరి యను విభుఁడ
వ్వసుమతిఁ బాలించె, జగ
త్ప్రసృమరకీర్తిప్రతాపభాసురుఁ డగుచున్ । 7

గీ॥ అతని పట్టపుదేవి దీవ్యత్తనూవి
లాసజితరతి దేవి, కలాకలాప
మహితమతి భానుమతి యను మానవతి, స
తంబుఁ బతిభక్తి నయ్యరుంధతియె తలపఁ॥ 8

సీ॥ కలహంసబాలికావలికి నెన్నడసొంపు
    గఱప నుత్సుకమైన గమనరేఖ
శరదిందురుచిచకచ్చకలకుఁ జాకచ
    క్యము నేర్పఁ జను మందహాసకలన
గండుమీలకుఁ జేటికదుపుపొత్తు ఘటింప
    గోరి యఱ్ఱాఁడు చూడ్కుల బెడంగు
కోకదంపతుల కెక్కుడుపొంగు సమకూర్పఁ
    దారకొను గుబ్బబంతుల తనర్పు

గీ॥ తనక కాఁ గూర్చి ధాత నూతనవిధాన
కలన సృష్టింప నొప్పు నక్కాశిరాజ
తనయ కొకరే యమంగళోదర్కమైన
స్వప్నముం గని యా రాజసత్తముఁడు॥ 9

వ॥ అయ్యనిష్టంబు సెప్పి, నిజమనోవల్లభ యుల్లంబు గాఱింప నొల్లక, తా నొక్కరుండ చని గంగాతటప్రాంతకాంతారంబునం దున్న యొక్కమునియాశ్రమంబు సేరి, యందలి వేదవిధిజ్ఞుల యనుమతంబునఁ దదుచితంబు లగు శాంతికక్రియాకలాపంబులు నిర్వర్తింపించుచుఁ, గొన్నిదివసంబులు గడపి, యొక్కనాటి ప్రాతఃకాలంబున నగరు సొచ్చి, యచ్చట॥ 10

సీ॥ తూర్పుఁదొయ్యలికి ముద్దులబిడ్డఁడై పుట్టి
    కఱకుఁజీఁకటిపొత్తిఁ గాలఁ దన్ని
తొలుసంజకావిదువ్వలువ యవ్వలఁ ద్రోచి
    పొదుపు గుబ్బలిమీద నడుగు లిడుచు
లలితకోమలకరావలి నోలి నిగుడించి
    తమ్మిలేఁజవరాండ్రఁ దట్టి లేపి

కలుషముద్రియుల సింగారముల్ సహించి
శోకద పతుల కోర్కెలు ఘటించి

గీ॥ దీర్ఘతగ ధరణీరుహాగ్రి దివ్యదరుణ
కిసలయశ్రేణిపైఁ దన కిరణరాజి
పద్మరాగాంకురద్యుతిఁ బాదుకొల్ప
బాల భానుండు దోఁతెంచు పట్టనంబు ॥ 11

వ॥ శుద్ధాంత పరివేశంబు సేసి యందొక్కచోట. 12

మ॥ అనిమేషస్థిరదృష్టి విస్మయవిశాలౌత్సుక్యసంభావనా
వినిబద్ధం బగు నల్లనం గలుపఁ, దద్వీక్షించుచు న వ్వామునో
చలసౌందర్యము కొంత్రిమ్మై మునికి నాశ్చర్యంబు గల్పింప, సం
జనితోల్లాసవిలాసభాసురముఖాబ్జశ్రీయుతుండై మదిన్ 13

క॥ అతివ చిరవిస్మృతోద్య
చ్ఛృంగార మగు వదనము సమున్నమితవిలసద్భ్రూ
లతమై, నిరవధిచింతా
క్రాంత మగు నాంతరంబుఁ బ్రకటించెనుఁ బో॥ 14

వ॥ అని వితర్కించుచు నొండియు. 15

శా॥ ద్యూతక్రీడ రుచింప దెప్డు, మృగయోద్యోగంబునుం గానరా,
దీతం డెన్నఁడు నన్నుఁ బాసిచనఁ డెందేనిన్ సుహృద్గోష్ఠి, కిం
కేతారుణ్యావలీవిలోలదృగపాంగప్రభావంబు ద
చ్చేతో బంధము సేసెనో, యని కడుం జింతించెనుం దా మదిన్॥ 16

వ॥ అని యూహించుచుం జేరంబోయి నిజహస్తాద్దర్శనంబున సంభ్రాంతయగు నక్కాంతారత్నంబు సమయసముచిత వర్తనంబుల స్వస్థచిత్తం జేయుచు వల్లన యిట్లనియె. 17

గీ॥ వదనశతపత్రముఁ జాలువాడి దేల
పలుకుఁ దేనియ? యో శతపత్రనయన!

నిందుచందురు నగు మోము నెరప దేల?
పండువెన్నెల, యో బింబఫల సమోష్ఠి ॥ 18

గీ॥ పొలుపు సెందిన సంపెంగ పూవునందు
వెడలుఁ దేరఁగ నేల? యి వ్వేఁడిగాలి
కమలదళయుగ్మకం బేల? కలఁక సెందె
హిమకణావృత మై యిట్టు, లిందువదన! 19

గీ॥ ఏల? యీ మౌనముద్ర? నీ కింత వంత
గలుగఁ గారణ మేమి? యేఁ దెలియరాదె?
యకట! తొల్లింటి చంద మిం తైన నెంతుఁ
గానగారాదు నీయందుఁ గలికి! నేఁడు ॥ 20

క॥ కడుఁబ్రీతి నెల్లప్రొద్దును
నడుగులకుఁ మడుగు లొత్తి యఖిలజనులు నీ
యెడ వర్తింతురు, చెలి! యే
వడువున నీ కింతవంత వచ్చెం జెపుమా! 21

ఉ॥ మాసినచీరఁ గట్టి, తలమాసిన నించుక రోయ, కెందు ను
ల్లాసము వాసి, యెంతయు నలంగెను చందనపంక మేమియుం
బూసినజాడ లేదు, కడుఁబొక్కిన దీ యధరంబు దీర్ఘని
శ్వాసపువేఁడిమిన్ జమరవాలమనోజ్ఞవినీలకుంతలా! 22

చ॥ అలరుల పొంతఁ బోవఁ, దలిరాకుల జాడ నొకింత సూడఁ గో
కిలకలనిస్వనంబు చవికిం జెవిఁ దార్ప, మరందపానతుం
దిలమదవన్మిళిందకులధీరమనోహరగానమాధురీ
కలనకుఁ జొక్కఁ గేళివనకౌతుక మూన విదేల? సుందరీ! 23

క॥ నాతుక! నీసుగనైక
ప్రీతిఁ జిరకీర్తు లట్లు ప్రియుఁ డుండంగా.
నీ తీరున నేటికిఁ జిం
తాకాంతం బయ్యె నీహృదయ? మి వ్వేళన్ 24

క॥ అని పెక్కు తెఱంగుల న
మ్మనుజేశ్వరుఁ డనునయింప, మానిని మదిలో
ఘనరూప మైన మానము
గనుకని వెసఁ గఱఁగి బాష్పకణరూపమునన్ ॥ 25

గీ॥ వెలి॥ నిగుడంగఁ గను లఱవిచ్చి చూచి
యేల హృదయేశ! మ మ్మింత సేయుచ మీకు?
నంతయనువర్తనీయుల మగుట కేము
నోమినారము కాము, తొల్బ్బమునందు॥ 26

క॥ అని లోనివెగటు దోఁపఁగ
వనితామణి పలుకుటయును వారనివేడ్కన్
దనబాహుపాశబంధన
మునఁ జిక్కంబట్టి యవ్విభుం డిట్లనియెన్ ॥ 27

సీ॥ ఇటు లాడ దగునె? యో కుటిలకుంతల! నీకు
నాయింటి పెన్నిధానమవ కావె?
కంజాక్షి! కల్యాణకల్లోలినివి గదా!
యస్మదీయాన్వవాయమున కెల్ల
నాదు కన్గవ కీవు నవసుధారసలవా
సారావసేకసంచార వగుదు
నాకు నీ యాలింగనము గంధసారవాః
పరిచురకర్పూరపూరప్లవంబు ॥

గీ॥ సుదతి! నాతల్పమున కీవు సురతశిల్ప.
కల్పలత వింక నాకు నీ కాని వెద్ది
యకట! నిను ననువర్తింతు ననఁగ నెంత
భక్తి సేవింతు నాపాలి భాగ్య మనుచు ॥ 28

వ॥ మఱియును. 29

సీ॥ శరదిందుచంద్రికాసౌభాగ్యవిభవంబు
కలికి! నీతనుకాంతి కలనయంద

చంద్రోపలస్యందిజలబిందునివహంబు
నాతి ! నీపరిరంభణంబునంద
శ్రుతిపుటాచమనీయసుమధురామృతఘటీ
యంత్రి మజ్జాక్షి ! నీయాస్యమంద
ప్రార్థితఫలదకల్పలతాసమాన్రింబు
చెలువ ! నీనునుపారుసెజ్జయుంద ॥

గీ॥ యస్ఖలితధర్మదీక్షాసమాధిసమధి
గమ్యరమ్యాప్సరస్సమాగమవిలాస
మతివ! నీతోడఁ బొందలు నేకాంతమంద
యుండ నాకేల ? నాకమం చుందు నెపుడు ॥ 30

మ॥ అని యిబ్బంగి ననేకభంగుల విభుం డబ్జాక్షి లాలించినన్,
విని యొక్కించుక కల్కి దేటి, యటు లేనిం ద్వద్వియోగానలం
బున నన్నుం బడఁద్రోచి పోయి యెచటం బుచ్చుం గలా రైతి, ఠి
ద్దినముల్ నాకు యుగంబులై చన, ధరిత్రీనాథ! యంచున్ వెసన్ ॥31॥

చ॥ కనుఁగవ బాష్పముల్ దొఱఁగఁగాఁ జెలి మోము వఁఱవాంచి నిల్చినం
జనపతి ప్రీతి సాంత్వనవచస్థితి ని ట్లను దేవి ! దైనవి
జ్ఞనపరిదర్శితంబు గ్రహచారవిపర్యయ మొందు వాపికోఁ
జనవలసెం జుమీ ? దివిజశైవలినీతటపుణ్యభూమికిన్ ॥ 32

వ॥ అచ్చటఁ దదుచితవిధికలాపంబులు నిర్వర్తింపం జేయుచు, బ్రాహ్మణ
పరతంత్రుండనై యిన్నిదివసంబులు మసలవలసె, నంతియ కాని నీ
యందలి నిరనుక్రోశతం గాదు చూడుము. 33

గీ॥ నిజకరాశ్లిష్టకైరవిణీకృతంబు
పద్మినియదాయోపచారంబు పరిహరించి
యుండునే ? తాన విధికుర్ని యోగజనిత
మగు వియోగంబు వారయక యబ్జవైరి ॥ 34

గీ॥ అనుటయును నైరవిణీప్రేమ మది యొకత్తు
ముడిగికొని కాల మొకభంగిఁ గడప నేర్చు

నట్లుగా దేని యదియు నా యట్ల బ్రదుకుఁ
బతిపునర్దర్శనాశ త న్నట్టి నిలుప ॥ 35

వ॥ అని యక్కాశి రాజపుత్రి నిట్టూర్పు ప్రచ్చుటయు నవ్విభుం డది
యట్టిద యని యంగీకరించి వెండియు. 36

చ॥ ప్రణయనిమగ్నమానసుల ప్రాణము లిష్టవియోగదుఃఖదు
ర్వ్రణవికలంబు లై పఱుగువారఁ, దదాశయ నిల్పుఁ, గానినా
డణునిభమధ్య! కైరవిణి య న్నలివారివియోగమున్, నభో
మణివిరహంబు బద్మినియు, మైనయి సైచి మనంగ నేర్చునే॥ 37

క॥ అని సముచితభాషణముల
వనజాక్షిం దేర్చు న య్యవసరమునందున్
విన నయ్యెఁ గలకలధ్వని
ఘనతరవాదిత్రనాద కలితం బగుచున్ ॥ 38

గీ॥ అంతఁ దెలియును దాను వాతాయనంబు
సేర నొయ్యనఁ జని చూచి, క్షోణివిభుండు
విస్మయావిష్టహృదయుఁ డై వెలఁదితోడ
నిట్టు లను గారవంపుసొం పెసక మెసఁగ ॥ 39

సీ॥ దేవి! నీవ జయించితివి గదా! యనె చూడు
మింతి యొక్కతె జీవితేశుఁ బాసి
విరహాగ్నిఁ జొరఁబాఱ వెఱచి చితాగ్నిఁ జొ
చ్చి విశేషుఁ బ్రీతిఁ దా ననుగమింపఁ
బోవు చున్నది పురంధ్రివిశుద్ధప్రేమ
కనుపమానోన్నతి యావహిల్లఁ
బతులందు సతుల కుప్పతిలు తత్ప్రణయమా
హాత్మ్య మింత నని చెప్ప నలవి యగునె?

గీ॥ చితియె మెత్తని పూసెజ్జ, శిఖయె పుష్ప
శరుఁడు, మంటలె గంధరసంపుఁబూత,
లల కృతాంతుండె ప్రియబాంధవుఁ, డహహా! యిట్టి
మహిమ లన్నియుఁ దద్విభ్రమములు గావె॥ 40

చ॥ అనుటయు నాసరోరుహదళాయతలోచన నాథుఁ జూచి యి
ట్లను ఝుటితిప్రబుద్ధవిరహాజ్వలనం బది యుండ, నెప్పుడో
తనువు చితాగ్ని కీగి వితతప్రణయైకరసప్రసన్నజీ
వన లగు వారికిన్ సదృశవర్తనమే? హృదయేశ! నావుడున్॥ 41

వ॥ అయ్యపూర్వవచనంబులు నిజహృదయంబున కించుక యవధానంబు గల్పించిన నవ్విభుం డవ్వాలందుక మొగంబునం జూచ్చి నిగుడించి చూచుచు నిప్పడంతుక నిశ్చయం బెంతదూరమున కెక్కినయది యిది దీనిమనోనిశ్చయం బగు నో కో యని విచారించుచుఁ దనమనంబున. 42

గీ॥ తరుణహరిణావసాదనోత్సవములందుఁ
బడతుకలు పన్ను నవియకాఁ, బ్రాజ్ఞు లాడు
విప్రలంభన వాగురావిభ్రమములు
కాక యివి నిక్కములె? యని కాంతుఁ డపుడు॥ 43

క॥ ఇది యంతయు నిజముగ నీ
మదిలో నున్నట్టి తెలిఁగె మానిని! యన న
మ్మదవతి తావకవిరహ
వ్యథఁ గుందిగిన మానసునిశ్చయమ యిదియనియెన్॥ 44

గీ॥ అది పరీక్షింతుఁ గా కని యతఁడు దనదు
మనసు దెలియంగ నీనివర్తనములోడఁ
గొన్నిదినములు చెలితోడఁ గూడియుండి,
వేట లాడంగ నని చెప్పి, వెడలి పోయె॥ 45

వ॥ ఇట్లు నిజవియోగదోదూయమానమానస యైన యజ్జవరాలిం దన మధురవచనరచనాచమత్కారంబుల నోదార్చియిదె యిమ్మనునాడు తిరిగివచ్చెద నని తదనుమతంబునం దరలి చనియె నప్పుడు, 46

క॥ కనుఁగవ బాష్పము లురులఁగ
దనుగాత్రి విభుఁడు దృక్పథము దాటి వెసం

జనునంతదాక నచ్చో
టన మాఱ్రిస్వడి నిలిచి కటకటంబడి చనియెన్ ‖ 47

మ‖ మఱునాఁ డే నరుఁదెంతు నన్న విభునమ్మాటల్ మదిం బెట్టి, య
మ్మఱునాఁ డమ్మఱునాఁడు నొక్కమొగి వైమానస్యముల్ సైచి, య
మ్మఱునాఁ డౌ క్కడఁ గూరుచుండి పతిసేమం బేమొకో!యంచుఁ ద
త్తఱపా టెత్తి ధరింపరానివగలం దా నుండఁ, దన్వంగికిన్ ‖ 48

వ‖ మున్ను దనపాఱ్రిసెనువెంట నాఖేటసహాచరుం డైన చన్న యొక్క పురుషుండు.

క‖ పాదసూపి నెమ్మొగంబునఁ
గడు దీనత దోపఁ, బలుకు గద్గదికమొయిన్
దడఁబడ, వెడవెడ నేడ్చుచుఁ
జెడిపోయితి మింక నేమి సెప్పుదు ? ననుచున్ ‖ 49

క‖ ఇతఁ డేమి సెప్పెనో యని
మతి గలఁగం దన్నుఁ జూచు మానినితోడం
బతి మృగయూరతిఁ జని మృగ
పతివాతం బడియె నన్న పలుకు వచించెన్ ‖ 50

గీ‖ అట్లు వచియించు నా దురాఖ్యాయి పలుకు
లంత మందకమున్న, తా నంత మొదెఁ
జెలువ సుకుమారతర మైన జీవితంబు,
వృంతవిరహిత మైన కొఱ్రివిర్వరియు పోలె ‖ 51

చ‖ సకియలు మూర్ఛయో యని వెసం బఱతెంచెదు నంతలోన, యు
ర్వికి డిగఁజాఱె బల్విడుగువేఁ్రిటున బడ్డ మనోజ్ఞపుష్పవ
ల్లికయనుబోలె హా! యిది యళీక మళీక మళీక మమ్మ న
మ్మకు మని వాఁడు గూయిడఁగ మానిని మే నిక నేమిసెప్పదున్ ? 52

గీ‖ పెక్కు లుపచారములు సేసి పెద్దనడికి
మూర్ఛ గా దని యొమ్ములు మోదికొనుచు

నేడ్చుసకియలఁ జూచి వాఁ డేగ జేని
క య్యసత్యఫలం బిట్టి దని వచింప ॥ 53

సీ॥ అచ్చట భూవిభుం డాఖేటరతి మాని
పటకుటీరమునఁ దల్పంబు సేరి
తనపంచియున్న వార్తకు ముందు రానున్న
పరిణామమున దృష్టిఁ బఱపి యుంచి
జిత్త మొక్కమ్మడిఁ జే నెట్టి కలఁచిన
తెఱఁగున లోలోనఁ ద్రిప్పికొనఁగ
నొం డెద్దియును దోప కొంటిమై ని ట్లటు
లగుచుండ నెడమఁ గన్నదరుటయును ॥

గీ॥ నడలి యే హితాహితార్థంబు లెట్లును
దెలుఁగఁజాల కుందు రెల్లవారు
వాని మున్న యెఱిఁగి వాకొ్రచ్చు నిజచేష్ట
నవయవములు జడము లయ్యె బళిరె ॥ 54

క॥ అని తలఁచుచు ఘనచింతా
జనితోద్వేగమున నది భృశంబుగ నాచే
సిన యా దుర్మంత్రమునకు
ననుబంధముఁ దెలుపు చున్కి యని యెఱిఁగి మదిన్ ॥ 55

వ॥ అకాశిరాజపుత్రిమనోవృత్తంబు నరయుచు వేఁడియు నన్నరేశ్వ
రుం డాత్మగతంబున. 56

గీ॥ ఇందువదనకుఁ బ్రియవిరహితము లైన
ప్రాణములు వాయు టది తృణప్రాయ మనుచు
ననదృశప్రణయాకుల మైన హృదయ
మంచుఁ గలిగిన దృఢనిశ్చయం బె యగును ॥ 57

గీ॥ కుటిలమతి నయి నేను తద్గుణమునంద
యొకమృషాదోష మూహించి యుందు నేని

యట్టి దుష్కర్మఫలము నా కనుభవింప
కకట ! తప్పదె యని యెంచు నవసరమున ॥ 58

వ॥ అవ్వార్తాహరుం డొయ్యొయ్య నొయ్యనం జనుదెంచి యొడలు కంపింప
బదంబులు గుడివడ నెట్టకేలకు నేకాంతంబునం దున్న యన్నరేశ్వ
రుం జేరి మ్రోల నిలిచి దేవా! దేవి కని యర్ధోక్తియందవాక్స్తం
భంబు వహించిన నుద్విగ్నహృదయుండై యవ్విభుం డోరీ! దేవి
కేమయ్యె నని యడుగుటయు. 59

గీ॥ దేవ! భవదాజ్ఞ యే శిరసావహించి
సముపదిష్టాభినయపురస్సరము గాఁగ
శ్వాపదాపాదితాపద్విషయ మృషోక్తి
దేవి కెఱిఁగింప నని పల్కి తెరలిపడుచు ॥ 60

క॥ నిట్టూర్పు వాఁడు గన్నీ
రుట్టిపడం దన్నుఁ జూచు చుండంగఁ గనుం
బెట్టిదపు గాలివీచిన
నట్టిటు వడు ద్రుమము నట్టులై నృపుఁడంతన్ ॥ 61

గీ॥ అకట మూర్ఛాతమిస్రమధ్యంబునందుఁ
బడియెనే? దేవి మనసు చెప్పఁగద రన్న!
యనుచు మిన్నోవ సూచుచు ద్వారబంధ
మానుకొని యున్న దేవి యున్నట్ల యుండ॥ 62

గీ॥ అని మఱియుఁ జెప్పఁబోయెదు నంతలోన
బాష్పగద్గదకంఠుఁడై పార్థివుండు
కటకటా! నేఁడు నాకు జగత్త్రయంబు
నంధకారాయితం బయ్యె నటర చెపుమ ॥ 63

వ॥ మఱి యేమి సెప్ప నుద్యుక్తుండ వయ్యెదవు వావురు దేవా! యేమి
సెప్పుదు? నప్పుడు వెడలిసన్న యన్ని శ్వాసపవనంబులు మఱి తిరిగి
రా వయ్యె ననుటయు నమ్మనుజేశ్వరుం డమ్మాటలకు నొల్లంబోయి

నేలం బడి వానిప్రయత్నంబునం గొంతవడికి నొకింత కలకదేరి
మఱియును. 64

గీ॥ అంబుజాతాయతాక్షి దేహంబునుండి
యకట! యూర్పులె వెలివోయె నంటి కాని
భర్తృహాదిజీవలోకోత్సవములె విధిని
హతము లై పోయె ననవు గేహంబు విడిచి॥ 65

వ॥ అని పలికి మరల మూర్ఛాపరవశుం డై పుడమిం బడి పరిజనప్రయత్నంబునం బెద్దప్రొద్దునకు లబ్ధసంజ్ఞుం డై య వ్విభుండు వెండియు.

క॥ కలకంఠకంఠి య య్యు
జ్జ్వలగాత్రమునుండి యకట! చయ్యన న య్యా
లలితవిలాసము లెవ్వొ యిఁ
బలపల నై పోయె, నా యభాగ్యము కతనన్॥ 67

గీ॥ కటకటా! యెట్టు లక్ష్మిక్రాగ్గిన్ను వాసి
తాదృశం బైన శుభవీక్షితంబు సనియె
నకట! యవి యెట్టు లట్టి యాస్యంబువాసి
సమధురస్మితమృదువచస్సంగతి వోయె? 68

వ॥ అని తలంచికొని పలవించి యంత నుత్కంఠ వొడమిన నిప్పు డద్దేవి యెచ్చట నున్న దని వారి నడిగిన నగరబహిఃప్రదేశంబునకుఁ గొని పోవంబడు చుండఁ జూచితి మను తదుత్తరంబు వడసి సోద్వేగంబును సఖేదంబునుం గా నతం డెట్లెట్లా! నా యీప్సితకల్పలత చితాదాహసముచితయని యొకో బంధుజనుల యీ వ్యవసాయం బని చిత్తవిభ్రమంబునం బరిభ్రమించుచుఁ గ్రోధంబు వొడమినం గటకటా! యిది య ట్లెన్నఁడును సంభవింపం బోదని వెండియు. 69

సీ॥ మత్స్యజాతిహిత యస్మత్తనూసహిత య
వ్వరగాత్రి తనులత వార కొట్టు
ల ద్దానిఁ బ్రోసామితోద్దామశిఖశిఖం

చితయును నింధనాచితయు నైన
చిత కౌఁగిలింప సమ్మతి సేత యుచిత మహా
నాటకప్పు డప్పద్మనయన దాన
ప్రీతిమై స్నిగ్ధశిరీష కేసరశిఖా
మృదునిజాంగకపాలి మేలగించి॥

గీ॥ వేల్చు గావుత స్నేహప్రవృద్ధ మైన
నాదు మదనాగ్నియందు విజ్ఞాన మెసఁగ
ననుచు వెస లేచి తేజిఁ దేఁ బనిచి యెక్కి
పయన మై పోయెఁ బితృవనప్రాంతమునకు। 70

వ॥ అట్లుపోవుటయుఁ దత్ప్రదేశంబున.

మహాస్రగ్ధర॥
కవిసెం జిత్యగ్నిదగ్ధాంగక వికలశవాకర్షణోత్కర్షభా క్ష్వే
రవఫేత్కారారవాకర్ణ ఘుటితభయోద్రాక్తదాత్యూహపక్షో
ద్భవ వాతోద్ధూతభస్మోత్కరమును, నయనాంధంకృతిప్రౌఢనాసా
భ్యవకర్ష్యుగ్రగంధ చేతోవ్యధవిధిపటు ధూమాంధకారవ్రజంబుల॥ 71

వ॥ దాన నయ్యూరి శ్మశానవాటికయందు నెత్తెంగి తోడన వారువంబు
డిగ్గనుఱికి యందొక్కయెడ బంధుపరివారపరివృతం బైన నిజేశ్వరీ
మృతకళేబరంబు గనుంగొని యక్కటా! మద్గృహేందిరమృతశరీరం
బున కిప్పుడిప్పాటు వాటిల్లెనే యని నెచ్చమూర్ఛ మూర్ఛిల్లి నేలఁబడి
కొంతవడికిం బరిజనకృతంబు లగు నుచితోపచారంబుల నల్లన లేచి
యచ్చటిబంధుజనం బెల్ల దన్నుం బరివేష్టింప నొక్కింతసేపు నిశ్చే
ష్టితుం డై యుండి మొగం బెగయించి వారలం జూచుచు వెండియు
నవ్విభుండు. 72

చ॥ ప్రియుని మన్నృపామరణవార్త చెవిం బడి నంతమాత్రకుం
దృణసదృశంబుగాఁ దొఱఁగె దేహ, మహో! యిపు డాసరోజపేం
శుణాలతనువల్లి నిప్పగిదిఁ గన్నులఁ గాంచియుఁ, దన్నిరాశకా
రణముగ నైన, భర్తృహరిప్రాణము లేగక నిల్చెఁ. జూడుడీ। 73

వ॥ అనిపలికి యాకిత్తు మొదలి నుద్దేశించి మఱియును.

గీ॥ కటకటా! కుంకుమమును సోఁకఁ గాంతివడుగు
నలరుదండలు సైఁబడ నలత సెంగు
శైశిరాతపంపు స్పర్శమున సైనఁ
గందువారును, నీమేను కమలయన! 74

ఉ॥ ఆకట! యట్టి యి య్యొడలి కట్టి!, చితానిచితాగ్ని దారున
మ్మ్యకరణం, బుదగ్రదహనార్చిరుపానయనోపచారనుం
జిక్కని బూదిపూతయును, చెన్నటిపక్షిగభూష మిట్లునా
కెక్కడ వ్రాసి తో హాతవిధీ! యిది నూచి సహించునుర్విధిన్॥ 75

క॥ అని యిట్లు పెక్కుతెఱఁగుల
జననాథుఁడు వగచు చుండఁ జనుదెంచి యశః
ఖని దేవతిలకుఁ డను నా
తనిమంత్రివరుండు వినయతత్పరమతి యై॥ 76

గీ॥ అ మ్మహాజ్ఞ గుణరాజి యభినుతించి
దైవవిధి యైన పరిణామదశవచించి
భావికర్తవ్యమున దృష్టిఁ బఱపి దేవ!
యాశ్వసిల్లుఁడు, నా నిట్టు లనియె విభుఁడు॥ 77

ఉ॥ వేవరి యాశుభాంగి వెరువెంటను తానును జీవలోకముం
బాసి చనంగ దయ్యె! నను భగ్నమనోరథు వీడి తొంటి యా
శ్వాసఁ, మిసీ! యసువ్రజము వారక దానిన కూడముట్టఁబో
నీసున నాగి దుష్టవిధి యేచుచు నున్నది యి త్తెఱఁగునన్॥ 78

సీ॥ అకట! యిం కెక్కడియాశ్వాస మేన యి
త్తెఱఁగునఁ బెనుఁగీడు తెచ్చికొంటి
నేన నాకయి పసిబూని కూపము ద్రవ్వి
కొని పిఱిఁడితనానఁ గూలిపడితి
నేన కాలాహియాస్యము వట్టి తెఱచి గ్ర

కుక్కిన దాని ము ద్దిడికొంటిఁ బ్రీతి
నేనకా దయమాలి యేపున ఖడ్గ మం
కించి కుత్తుకఁ గత్తిరించికొంటి

గీ॥ నేన లోనఁ బరుండి యహీనదుర్వి
వేకపరిపాకమునఁ జిచ్చు వెట్టికొంటి
నింటివాకిటి కహహా! యింక నెట్టు లోకొ-
ఘోరదుఃఖంబు దప్పించికొందుఁ జెపుము! 79

చ॥ అనుటయు న య్యమాత్యవరుఁ డాత్మఁ గలంగియుఁ బ్రీతి మై తదా
ననమునఁ జూడ్కి నిల్పి జననాయక! యిమ్మెయి దుఃఖహేతువుల్
ఘనతరలీల నున్నపుడ కాదె మహామహు లైనపెద్ద లె
ల్లను ధృతిబల్మిచే నవికలస్థితిఁ గాంచి సుఖింత్రు నావురున్॥ 80

శా॥ నైర్గుణ్యం బొకఁ డైన నించుకయు న వ్వామాక్షియం దున్నచో
నాగం జాలక నెమ్మన బ్బ నిటు లాహా! యేల పోనిత్తుఁ, ద
త్సౌగుణ్యం బణుమాత్ర మైన నితరస్థానంబునం గాంచు నా
శాగాథల్ గల వేని, యేమిటి కనాశ్వాసస్థితిం బొక్కెదన్॥ 81

వ॥ అని తనవచనంబుల కతం డుత్తరం బిచ్చుటయు నది యట్టిద యగుం
గాక దేవా! యాపదలయందు ధైర్యం బొక్కటియ యవలంబనం బ
గుట మీ రెఱుంగని యదియే? యనిపలుకుచున్న య మ్మంత్రివరున
కన్నరవరుండు వెండియు. 82

గీ॥ అకట! దైవోపహతుఁడ నై నట్టి నాకుఁ
గలిమి నీదృశవిప్రయోగము నెదిర్చి
యేయది ప్రతీకారగతిఁ బని సేయఁ జాలు?
నా తథావిధధైర్య మేలయ్యా! చెపుము॥ 83

క॥ అని యటు శవపోలాలో
కనకరుఁ డై తిరిగి చూచి కడు దీనత న
జ్జనవిభుఁడు వెఱ్ఱి యెత్తిన
మనుజుఁడునుం బోలె నగుచు మఱి యిట్లనియెన్॥ 84

గీ॥ కడు నగాధంబు మనస్స్నేహజలధి యెందు
దేవి! యద్దాని పార మెద్దితివి నీవు
కటకటా! నేడు ఘోరవిఘ్నంబు దొడరి
యందు మునుగుచు మూర్ఛిల్లు చుందు నేను॥ 85

మ॥ కడుసంప్రీతి సనంగమంగళకలాకల్పంబవై యుంటి వి
వ్వుడ నీ విప్పుడ హృద్విదారణవిధాస్ఫూర్తిన్ విడంబించె ది,
వ్వుడ సౌభాగ్య సుఖైకయుక్తి మదసమ్ముగ్ధుండనై యుంటి, ని
ప్పుడ నిశ్శ్రీకత జీవకోటి కెడమై పోతిం జుమీ యింతలోన్॥ 86

గీ॥ అనుచు నుద్వృత్తి నున్న య య్యధిపుఁ జేరి
దేవ! దేవికి హుతవహోదేశ మిమ్మ
టంచు బంధుజనంబు ప్రార్థించుటయును
వలదు వల దని యతఁడు తీవ్రముగఁ బలికె॥ 87

వ॥ అలుక వాడమి యశాస్త్రస్మృతిషిద్ధ బగు నీ కార్యంబున కెట్లు గడంగెద
రీబంధువు లని యామాత్యు నడిగిన నతండు దేవా! యేల యిట్టిని
ర్బంధంబు కోపం బుపసంహరింపం గదే యని సవినయవచనంబులం
బ్రార్థింప నప్పుడ మ్మహీవిభుండు. 88

గీ॥ దైవహతుఁడ నటంచు నన్దలఁగఁద్రోచి
కాంత నెమ్మెరు వహ్ని కర్పింతు రేని
హృదయసంరోధమున నోప లేను నిపుడ
చితిఁ బ్రవేశింతు నిది సునిశ్చితము సుండు॥ 89

వ॥ అని ససంభ్రమోన్మాదంబుగాఁ జితాభిముఖుం డై పలుగిడుచున్నం
గని చింతావ్యాకులితహృదయుం డైన య మ్మంత్రియు నతనితోడన
పలుగిడి యత్యాహితం బొందు జరుగకుండం జూచుకొను చుండె
బంధుజనంబులును నెద్దియుం జేపక విషణ్ణహృదయులై యూఱ
కుండి రివ్విధంబునం బ్రవృత్తంబైన యీ యుత్తమకావ్యంబు నుచితర
చనాప్రచురంబుగా.

క॥ సుబ్రహ్మణ్యకృపాభ్యుది
త బ్రాహ్మీవివిధవిలసితనిరస్తమనో
విభ్రమముఁ, డనుములవేంకట
సుబ్రహ్మణ్యుఁడు రచించె సుస్థిరఫణితిన్ । 91

అం దిది ప్రథమాంశంబు

ఓం-తత్ -సత్



శ్రీ శారదాయైనమః

# భర్తృహరి నిర్వేదము.

## ద్వితీయాశ్వాసము.

క॥ శృంగారరసపరిసరద
పాంగాలోకనకళాసమంచద్భ్రమరా
లింగనసుఖితాంగ! జితా
నంగా! శ్రీశైలమల్లికార్జునలింగా! 1

వ॥ దేవా! యవధరింపు మట్లు నిజకాంతానితాంతవిరహాచింతా సమా
క్రాంతహృదయుం డై చిత్తవిభ్రమంబు పొడమి తదుచితచేష్టాకలా
పంబునం బరిభ్రమించుచున్న యన్నరనాథు నాశ్వసించు నుపాయం
బొందు గానక దేవతిలకుం డను న మ్మాంత్రిసత్తముండు త న్నేకాం
తంబునం బంచిన నొక్క-యెడకుం బోయి వచ్చుచున్న యక్క-ంచుకి
తన మనంబున. 2

గీ॥ అతిజరాభారసన్నతం బైన యొడలు
స్వామిశోకభరంబున సడలువాఱఁ
పయిని దత్ప్రవికారసంభ్రమము నైన
నింక దీనికి నవలంబ మెద్ది గలదు॥ 3

క॥ అని వగచికొనుచు నచటికి
జనుఁ దెంచి యమాత్యవరుని సన్నిధిఁ దా బో
యినపని తెఱంగు సెప్పుదు
నని యటునిటుసూడ నాతఁ డం దొకచోటన్॥ 4

క॥ మనసున మిథోనిరూఢ
ప్రణయగుణగ్రథనసుస్థిరం బయి యిటు ని
ల్చిన యీ మరణసుస్థాకర
తుని శోకం బెట్లు వెడలఁద్రోయం జనునో॥ 5

గీ॥ అనుచుఁ జింతించుచుండంగఁ గని యతండు
దనకు నవసర మీ నేకతంబునందు
దగ నమస్తంబు నెఱిఁగించి తరలె నంత
న య్యమాత్యుండు వోయెఁ గార్యాంతరమున ॥ 6

వ॥ అప్పు డ మ్మహీకాంతుండు వెండియు న య్యండజయాన మృతకళే
రంబుపయిం దృష్టి సారించి హా దేవి! కాశిరాజనందని! యెందుఁ బోయి
తని పలుకుచు నిట్టూర్పులు గూడ బాష్పపూరితనయనుం డై- 7

చ॥ పరిణయిమ్మృతిఁగ విసందడవఁ బ్రాణము లీవు దొలంగ నంగనా
గణము యశంబు వోయె ద్రిజగంబుల నొక్కట దాఁటి, యేను ని
ర్ఘృణత జుగుప్సితం బయిన యి య్యొడ లింకను బాయనేని యె
ట్లణఁపఁ గలాఁడ న య్యుపజనాపయశఃపటుడిండిమధ్వనుల్ ॥ 8

గీ॥ కాన నిన్ను మదంకభాగమునఁ దాల్చి
యొడ లుదగ్రానలమున కాహుతి యొనర్చి
మగువ! మఱుమేన నీ యనుస్మరణవశత
నిన్నుఁ బడయుదు నిదె చూవె నిక్క మనుచు ॥ 9

వ॥ మనంబున నదియ నిశ్చయించికొని తదనురూపక్రియాకలాపంబునకు
సన్నద్ధుం డై యుండ న య్యవసరంబున. 10

గీ॥ ఓసి! గారాబుబిబ్బిక యోసి! నాదు
పెన్నిధానమ! నీ వెందుఁ జన్నదాన
వకట! పాపపుదైవంబ! వికటవృత్తి
నాముడిబ్బిక నెడఁబాప నాయ మటర ॥

చ॥ అను నొక యార్తరావము రయంబున వీనులు సొచ్చినం గృపా
వననిధి య వ్విభుండు నను వంటి యభాగ్యతముం డెవఁడొ నె
మ్మనమున నార్తి నొంది ధృతిమాలి వగచ్చుచు నున్నవాఁడు సాం
త్వన ముచితంబు గాదె జనవల్లభుఁ డై సడినన్న వానికిన్ ॥ 11

వ॥ అందును నీవృకెం బైన దైవవిపర్యయంబున నంతిమశయ్యం బ్రా
పింపనున్న నరుఁబోటివానికి నాశ్చర్యత్రాణనం బను నీస్వర్గపాథేయం
బయాచితోపనతం బై చేకూరినఁ గ్రోసిచనం జన్నె? యని యన్నె
లవు పరికించి పోవుటయు నచ్చటఁ దొంటితెఱంగున. 12

గీ॥ ఓసి! గారాబుడిబ్బిక! యోసి! నాదు
పెన్నిధానము! నీ వెందుఁ జన్నదాన
వకట! పాపపుదైవంబ! వికటవృత్తి
నాదు డిబ్బిక నెడఁబాప నాయ మాటర! 13

చ॥ అని విలపించు చున్న శిథిలావయవుం గనువృద్ధయోగి నా
క్కనిఁ గని యన్న రేంద్రునిఁ దరుకంప జనింపఁగ నాశ్వసిల్లు మో
యనఘ! యటన్న బాష్పవికలాక్షియుగంబెగయించి చూచి య
జ్జనపతితోడ దుఃఖవివశస్థితి దోపఁగ నాతఁ డిట్లనున్ ॥ 14

గీ॥ ఏటి యాశ్వాస మింక నా కేటి బ్రదుకు
నా యనేకగుప్తైకప్రణయిని బహువి
షయకరిభ్రమణాగ్రసంచారశీల
నాకు డిబ్బిక యిట్లు న న్బాసి చనియె॥ 25

క॥ అనుటయు జాలిం బడి యా
యన ప్రేమోవిషయ మొంత యల్పం బైనం
దను వీడి చన్న శోకిం
పని వాఁ డెవ్వండు దుఃఖపరతంత్రుం డై॥ 16

వ॥ ఇంతమాత్రంబున కీయోగీంద్రున కిట్టి దుఃఖంబు వాటిల్లె నన్న నస్మా
దృశుల కీవృశం బగు నాపద్విషయంబునం జెప్ప నేల? యని తలం
చుచు నైన నుచితవచనంబుల నాశ్వాసింతు నని పూని వెండియు
నతనిం జూచి యోగీశ్వరా! యేల యింతమాత్రపు వస్తునాశంబున
కింత మరపిల్లెదు నావుడు నతండు. 17

గీ॥ అకట! నీ వెవ్వఁడవు నిష్ఠురాత్మకుఁడవ
వట్లుకా దేని యేతద్గుణాలి యెఱుఁగ

కిట్టు లాడెద వంచు శోకించుటయును
నాతఁ డేతద్గుణాలి యె య్యది యటన్న ॥ 18

గీ॥ ఎన్ని యన్ని వాని నే గణియింప నేర్తు,
నైన నొకకొన్ని సెప్పెద నవధరింపు
మయ్యా ! యని తద్గుణశ్రేణి యాకళించి
కొనుచు నున్నట్టు లుండి యి ట్లనియె నతఁడు ॥ 19

సీ॥ ప్రీతిమైఁ బిడక లేరికొనంగ నదె వచ్చు
నదె వచ్చుఁ జలిమంట కగ్గిఁ దేర
జలసమాహరణంబు సలుపంగ నదె వచ్చు
నదె వచ్చు భైక్ష్యపర్యటనమునకు
బికిరంపుఁగూడు డాచికొనంగ నదె వచ్చు
నదె వచ్చుఁ బయిమూత కావటింప
పచనక్రియకుఁ దా నుపకరింప నదె వచ్చు
నదె వచ్చుఁ గంచ మై యశనమునకు

గీ॥ లీల నదెవచ్చు నీరముల్ గ్రోలుపనికి
నలసి పవళింపఁ దలగడ కదియ వచ్చు
గటకటా ! యింక నెట్టేయక్కఱను గాదు
మాకు మాడిబ్బి తలఁపుల మానికంబు ॥ 20

వ॥ అని నిట్టూర్పులు పుచ్చుటయు నవ్విభుండు.

చ॥ అగు నగు నట్లకా కిలఁ బ్రియం బగు వస్తువునందుఁ దోచు నా
సుగుణము లిట్టి వట్టి వని చొప్పడఁ జెప్పఁ దరంబె యేరికిన్
జగమున నెల్లవారు విలసత్ప్రణయైకనిబద్ధబుద్ధు ల
ట్లగుట సుఖంబు లెల్లను బ్రియార్థగతంబుల వారి కెప్పుడున్ ॥ 21

వ॥ అయినను వశక్యప్రతీకారం బగు వస్తువినాశంబున కిట్టు లనుతపింపం బోలునే ? యనుటయు నయ్యోగివరుండు దీనాననుండై యయ్యో ! యేన యి ద్దాని నిర్మాణపాటవంబు పరీక్షింపం బూని నేలం బడ వైచిన నిది యి ట్లయ్యె న ట్లగుటం జేసి నా సంతాపం బనన్యాపారావంబు గావున ననివార్యయాపం బని కన్నీరు నించుటయు నతండు ॥ 22

చ॥ తన హృదయంబు దానఁ గడుఁ దల్లడ మందఁ యతీంద్రుఁ జూచి యి
ట్లనుఁ ద్రిభువనస్తుతాని యెటు లైన సహింప నశక్య మట్టిచోఁ
దన యవివేక మొక్కఁడ కతంబుగ న య్యాది నష్ట మైన న
వ్వని యసువుల్ శరీరమున వారక నిల్చు నిమేష మేనియున్॥ 23

వ॥ అని తన కన్నుఁగవం గ్రమ్మిన బాష్పజలమ్ము లల్ల నల్లనం దుడిచికొని
ధైర్యంబు వహించి యమ్మోగిం గాంచి వెండియు. 24

క॥ భగవతి భవితవ్యత యది
యగణితమహిమాఢ్య, ప్రియము నప్రియముం దా
ర్పఁగ దోర్పఁగఁ జాలు నన
ర్థగతిం బురుషుండు నిరపరాధియు చుమ్మీ! 25

వ॥ అనుటయు నతని య వ్వచనంబు లాకర్ణింపక య య్యతి నిజభగ్న
భాండఖండంబు లెదం బెట్టికొని యొక్క మొగి వాపోవుచుండె న
మ్మహామండలాఖండలుం డది సూచి మునీంద్రా! యేదువకుము
నీకింతకంటె నత్యధికతమంబు లైన మృణ్మయరజతమయహిరణ్మయ
పాత్రికలొసఁగి నీ యిచ్చవచ్చిన దిచ్చెద శాంతింపు మనుటయు నతండు
కరపుటంబునం గర్ణపుటంబులు మూసికొని యిట్లనియె 26

గీ॥ పాపము శమించుఁ గాత మి ప్పాటి మంటి
కుండికయె పరిణతి నిట్టి ఘోరదుఃఖ
మావహింపంగ స్వర్ణాను లట్టి! నాకు
మఱియుఁ జెప్పెద విను మొక్క మాట నీకు॥ 27

మ॥ సమహాదోషమహాభ్రమివ్రజముఁ జాంచల్యోచ్చలద్భంగ ము
గ్రమదగ్రాహసముద్భవంబు భయనక్రక్రూర మా నీ యన
ర్థమహాబ్ధిం బడఁ ద్రోచి యుద్ధతవిపద్భ్రష్టాత్ముఁ గావించె న
ర్థము దా నల్పతరార్థ మయ్యును మహార్థం జేల మాబోంట్లకున్?28

గీ॥ అదియుఁగా కింతకంటె మే లైనదాని
నిచ్చెద న టన్న మాట య దేటి మాట

చులుకఁ జేసితిగా కెంతఁ గలదె యిట్టి
ప్రకటబహుగుణసుభగ యిప్పాటి డిబ్బి ॥ 29

క॥ ఇది సుగభీరసువిస్తృత
యిది సుదృఢప్రకృతి యిది సుమృదుసుస్పర్శా
స్పద, యిది మనోహరాకృతి,
మదిఁ దలఁకఁగ నిట్టి డిబ్బి మహిలోఁ గలదే! 30

వ॥ అనుటయు సనిర్వేదంబుగా నతండు.

గీ॥ సులభములు సుగుణాధికంబులును నైన
యితరములు పెక్కులుండఁగా నేమి జగతిఁ
బ్రణయమునఁ జూచె! వస్తు విధ్వంసమునకు
నంత వాడమించు వాఁడయు నే మైనఁ జేయు ॥ 31

క॥ ఇది యధికతరప్రియ మను
మది వస్తువు గుణవిశేషమహిమంబుఁ బు
ట్టదు మోహాధీనము స్నేహము
యది గుణసాపేక్ష మైన యది గాదు సుమీ! 32

గీ॥ అనుటయును నాఁగి యోగి! ముగ్ధాత్మకుండ
కేవలస్నేహమాత్రంబ కా వనవకు
మిది సురక్షిత మై యుండు నేని నాకు
దేహపోషణకార్యంబు దీనికృతము॥ 33

వ॥ అనుటయు మునీంద్రా! యిది యిప్పుడు వినష్టంబు గాకుండు నేని
యు నెంత కాల ముండం గలయది. 34

గీ॥ కల్పకోటిసమో, యటు గాక కల్పశతమొ,
కల్పమొ తదర్ధమో యుండఁ గలది యైనఁ
చేటు నకొ కింత శోకింపఁ జెల్లుఁ గాక
ద్విత్రిదివసస్థిరం బగు దీని కేల ॥ 35

క॥ వివిధవిపత్ప్రదమును దు
ర్భవమును నగు నొడలి పొందు పరికింపగ నీ
కవుట యది పాణిపొందం
బువులకు నయినట్లు ; కడువిమోహకమవుటన్ ॥ 36

వ॥ అట్టినను లోకం బేల విప్రియంబు దొలంగి ప్రియంబు ననువర్తించెదు
వనుటయు నందులకు విభ్రమం బొక్కటియె కారణం బని యవ్వి
భుండు. 37

క॥ ఇవి యి మ్మైనికహితవ
స్తువులి య్యవి తొలఁగి శోక దుస్సహ దుఃఖో
ద్భవకారి యను తలంపిది
వివేకవిరహితుల మనసు విభ్రమము సుమీ ! 38

క॥ అనఘ ! ప్రియవిషయసౌఖ్యవ
మునకుం దొలుదొల్త నెంత ముదిసిన తూఁడన
ద్వివిపాతంబున కంటెయు
పెనువగలం బొరలుచు దాని ప్రియ మేమిటిదో ॥ 39

గీ॥ అప్రియము రా చేత నత్యంతశయమును
శోకచేఁ బరమాహ్లాదమును ఘటించు
వెనుక ముం దను భేదంబు విడువఁ బ్రియము
నప్రియంబును ననుట మోహజము సువ్వె ॥ 40

వ॥ అని యన్న రేంగ్రిందు చెప్పిన నట్యోగి యది యట్టిద యగుట
నేనును నెఱుంగుదు నైనను నా హృదయం బప్రతీకారపరికారంబు
గా దురపిల్లెడు నావును దత్ప్రతీకారసాధనం బగు వస్తువిచారం బను
ని ప్పరమోపాయం బెఱిఁగియు దాని వినియోగంబునం దసమర్థుండ
నన్న నొండు ప్రతీకారం బెద్ది యుండు నని పలికె నందుల కతండు. 41

గీ॥ కాన మరణమె తత్ప్రతీకార మట్టు
లగుట నిద్దాని హృదయంబునందుఁ దాల్చి
యసువులు దొలంగి యవలి జన్మాంతరంబు
నందు నేతత్సనాథుండ నగుదు నేను ॥ 42

వ॥ అనినం బిన్నటినవ్వు నెమ్మొగమునం దాల్చుచుండంగ న
జననాథుండు ముం గనుంగొని యిదే సంసారమూలంబు వాఁ
జను న మ్మోహము దాని సంతతవిలాసంబుల్ గదా! దుఃఖముల్
వినవే నాపురుఁ జెప్ప నవ్వి యతఁ డుర్వీనాథుతో ని ట్లనున్ ॥ 43

గీ॥ మూర్ఖుని పరోపదేశవిస్ఫూర్తి యనఁగ
నిదియ కాఁ జెప్పుదురు బుధు లెల్ల దెసల
దీప సంవృతమోనివృత్తి యగు నత్య
పటుతమిస్రావరుద్ధదీపమునఁ బోలె ॥ 44

వ॥ అనుటయు న వ్విభుండు స్వవైలక్ష్యంబుగా నధోముఖుండై యెద్ది
యేని తలంచుకొను చుండ న య్యోగీంద్రుండు రాజా! యేమి చిం
తించెదవు నాపుడు మహాత్మా! చింతింప నొం డెద్ది గలదు. నా స్వ
వాక్యంబులన నాకి ట్లుపదేశించి శోకాపనోదనంబు సేసిన మీ య
సాధారణప్రభావంబు దలంచి కొను చున్న వాఁడ ననుటయు. 45

సీ॥ అగు నది యట్టిద యనఘ! యేము
వింధ్యనివాసినీదేవి నఖిలవంద్యఁ
జూడంగఁ బోయి వచ్చుచు నిట్టు లున్న ని
న్గని సత్వసులభ మగు కరుణకతన
యుష్మదేతత్ప్రబోధోన్మీలనము సేసి
నారము నాపుడు నరవరుండు
ప్రకటపరిభావు లీరలు సిద్ధవరు లైన
గోరక్షనాథు లాకో యటన్న

గీ॥ నతము నీ చెప్పినట్ల యా ననుదు జేసు
ప్రీతిఁ జూచుచు నే నుద్ధరింపఁ బడితిఁ
బరగ నట్టి మహాంధకూపంబు నుండి
యనుచుఁ దత్పాదపద్మంబు లందుఁ బడియె! 46

గీ॥ అతని లేవ నెత్తె న య్యోగివరుఁ డంత
మ్రొక్కుఁగేలు ఫాలమున ఘటించి

యింక నెన్నఁటికిని నిట్టిమోహము నొంద
కుండఁ దెలుపుఁ డనియె నుర్వివిభుఁడు ॥ 47

వ॥ అనుటయు న య్యోగీంద్రుండు. 48

క॥ ఏ నింకఁ జెప్ప నేల మ
హీనాయక ! చెప్పఁదగిన దెల్లను దగ నీ
మానసమునందఁ దోఁచె, న
నూనోద్బోధుండ వైతి వోహో యనుచున్ ॥ 49

సీ॥ భవితవ్యతయు చాల బలవంతు రా లంటి
వఖిలంబుఁ దత్పరాయత్త మంటి
స్నేహ మన్నదియె వ్యామోహవిభ్రమ మ నంటి
సకలవస్తుచయంబు క్షణిక మంటి
ప్రియాప్రియముల నిర్ణయము మానస యంటి
వాఁడలజంజాటకం బుత్త దంటి
వస్తుతత్త్వ మెఱిఁగి వగుచు టజ్ఞత యంటి
మోహంబు సంసారమూల మంటి

గీ॥ వరయు మాలిన్యతికి నాత్మదోషమునకు
నెద్ది కతము? స్నేహ మేల కలిగె?
వస్తుతత్త్వ మేమి? వసుధఁ బ్రియం బెట్టి?
దోఁడ లదెంత దాని కడలు టెంత॥ 50

ఉ॥ తాన సుఖంబు నాఁ జను పదార్థము, దీని నెఱుంగమిం బరా
ధీనముగాఁ దలంచి సుఖతృష్ణ సుదుఃఖదముల్ సుఖభ్రమ
స్థానము లైన వే ఱొక పదార్థము గోరి సతంబుఁ దత్కృత
గ్లానికి నోర్చుచుం దదుపలబ్ధికిఁ జేయుదు రెల్ల యత్నముల్ ॥ 51

గీ॥ ఇంత సేసియుఁ బడయరే యేని వారి
దుఃఖమున కెంత యవధియు లేదు దొరకు-
వేళఁ బడసిన నది మనోవిభ్రమంబ
కాని దాన సుఖం బెందుఁ గానరాదు ॥ 52

క॥ ఏన సుఖప్రభను వోవమి
దానం దన కగు ఫలంబు దాత్మాలుగ డెం
దానం దలఁచుచు బ్రియుతా
ధ్యానంబునఁ దవిలి కడు వెతలు వడుచుందుర్ । 53

గీ॥ అదియ మాయ యనంబడు నాదిశక్తి
యది యనాదియు సాంతయు నై చెలంగు
దాని కంతంబు తత్త్వసందర్శనమున
దాన నది వోవుఁ డివియుచేఁ దమము వోలె ॥ 54

క॥ ప్రియ మిట్టిద యని తోఁచినఁ
బ్రియతామతి దనకుఁ దాన పెల్లుబ్బి చను ని
ష్ప్రియ మిట్టిద యయ్యును విను
మయమహితా! యీయుపాయ మలవడ కున్నన్ ॥ 55

గీ॥ కొండవయుపాయ మింక నొకండు గలదు
ధారుణీశ్వర! వస్తువిచార మనఁగఁ
నదియు నది మధ్యరూపాయ మనఁగఁ జరగు
తొలువెరవుకంటె నిది కొంత సులభ మగును ॥ 56

చ॥ ప్రియ మని యనూచునప్పుడగుఁ బ్రీతిఁ బ్రయత్నము సేయునప్పుడ
జ్జయముఁ బొందునప్పు విలసద్గతిఁ దాన సుఖించునప్పుడి
ద్దయముగఁ దద్గుణావళి మనంబున మెచ్చెడునప్డు వాని ని
ర్భయవిషయప్రవృత్తులకు బరుగన నవ్వుఁ గృతాంతుఁడప్పుడుర్ ॥57

గీ॥ అధిప ? సంయోగములు వియోగాంతములు స
ముచ్ఛ్రయము లెల్లఁ బతనాంతములు దలంప
వనయము క్షయాంతములు నిచయములు జీవి
తములు మరణాంతములు వస్తుతత్త్వ మిదియె ॥ 58

వ॥ అని యి య్యుపాయంబు నేర్చిన పెద్దలువస్తువుల సంయోగవియోగాది
రూపంబు లగు నవస్థావిశేషంబుల నప్రమత్తులై వర్తింతురు। మఱియు
నీచెప్పినట్లు. 59

క॥ అతిబలవతి యగు భవిత
వ్యత యెంతకు నైన నేర్పు నటుగాన స్వయం
కృతపరకృతముల భేదము
మతిఁ దలఁపరు ప్రియవినాశమార్గమున బుధుల్ ॥ 60

గీ॥ అధిప ! మూడవమార్గ మే మన్న వినుము
ప్రియువినాశంబు లం దది పెంపుసేయు
స్నేహవశమునఁ బొడము సమ్మోహ ముడిగి
వస్తుదోషంబు లరయంగ వలయు దాన ॥ 61

క॥ వినుము వియోగవినాశము
లను నిర్దోషములె కాక యఖిలార్థములం
దును భావార్థసను
జ్జనకత్వం బనెడు కీను సమ మై యుండున్ ॥ 62

గీ॥ దాని నెఱుఁగు నేని దగులంబు వొడమదు
భోక్త కెప్పు డరుని ఘృణ్యు చూఁడు
దాన దక్ష్వనాశ మైనను గలకఁ జే
యంగఁ జాల దిది యథార్థ మధిప ! 63

క॥ ఘువుబోడి నీదు మరణ
శ్రవణమునన చావ నేల సతి పతిసేవా
ప్రవణమతిఁ బ్రదికి యతఁడు త
నువుఁ దొఱగిన ధర్మ మను మనోభావమునన్ ॥ 64

గీ॥ చి చ్చుఱికి భర్తృసహగతిశ్రీ దలిర్ప
లీల స్వర్లోకసుఖ మందఁ బోలుఁ గాక
భోగవైరస్యభావనాస్ఫురణఁ జేసి
ప్రాణములు తత్క్షణమునఁ గోల్పడగ నేల ॥ 65

క॥ విరహాగ్ని యుండ నేటికిఁ
దరుణి చితానలము సొచ్చి తనువుఁ దొఱఁగ, ని

ర్భరభర్తృప్రణయసిరం
తర లగుచెలుల కిది యనుచితం బనదె నృపా! 66

గీ॥ ప్రేమ యని దాని కొక పెద్దపేరు వెట్టి
తత్పరీక్షకుఁ గడఁగి యీ తప్పు సేసి
తది యొక మహాగుణం బెట్టు లయ్యె? దాని
కలిమిఁ బరికింప నే లింత యులుకు సెపుము॥ 67

క॥ అతిసుభగాకృతి వత్స్య
ద్గతయౌవనమదసమన్వితాత్ముఁడ వతనీ
పతివి చతురుఁడ వమ్మద
వతి నీ విరహముఁ గోరువమి యొక ఘనమే॥ 68

చ॥ ఘనతరకామవిప్లవము గాక మహాప్రణయం బటంచు నీ
కనిన గుణంబు వే ఱొకఁడు గల్గినఁ జెప్పుము విందు మింతనూ
త్రన చెలి నింత నేసితి కదా! మరి దానిని గాదె నిష్ప్రియో
జనముగఁ దచ్చితాగ్నికి వెసం జను వీఁ గమికింది తిమ్మెయిన్॥ 69

చ॥ పరమదరిద్రుఁ డైనను గృపారహితుం డయినం బరాఙ్గనా
పరవశచిత్తుఁ డైనను నపండితుఁ డైనను లోభి యైన నా
తురుఁ డయినన్ సమస్తజనదూషితుఁ డైనను నోర్చి యే కృశో
దరి పతిభక్తి తన్మయతఁ దా నతనిన్ సతతంబు గొల్చుచున్॥ 70

క॥ తనకంటె మున్న మరణిం
చినఁ దన విధి యనెడు నేకచిత్తంబున వా
నిన యనుగమించు నవ్వని
తన కాదె బుధుల్ పతివ్రత యటండ్రు మహిన్॥ 71

గీ॥ వ్రతము నా నెంచు ధర్మైకరతిని విహిత
కృత్యములయందు బహువిధక్లేశములకు
సైచి యవ్వని నరవేశ్య సరణి గాని
స్మరకరాహతి కోర్వక నమయు టగునె॥ 72

వ॥ కావున నీకు నీ ప్రోయాలి యెడం దోఁచిన గుణవిశేషంబులు మా
గ్ధ్యమాత్రవిలసితంబులు గాని పాతివ్రత్యఫలభూతంబులు గానేరవని
మఱియు నరేంద్రా! యిప్పు డుత్కటదుఃఖాభిషంగ లాంగలావకృ
ష్టంబై వస్తువివేకరసానసేక సంపన్నంబగు నీ హృదయక్షేత్రంబు
విజ్ఞానబీజావాపంబున కెంత యేనియుం దగి యున్నయది వినుమని. 73

శా॥ కర్మిన్నం బ్రోన్నతశక్తిఁ జో విడుము సంకల్పంబు సంకల్పని
ష్పన్నం బి న్నిబిడాత్యహేతు వగు సంసారం బాగిం బోవు నా
సన్నాహంబునఁ బొందఁ గంచు మనుజేశా! దేశకాలానవ
చ్ఛిన్నాద్వైతసుఖాత్మకం బయిన సచ్చిద్వస్తుతత్త్వంబు నాఁ॥ 74

క॥ సుమహితభక్తిభరంబున
శమివరు పాదముల కెఱఁగి జనపతి మునిస
త్తమ! యాశాపరిపర్యా
యము లగు సంకల్పములు నిరస్తము లయ్యెన్॥ 75

మ॥ ముకులీభావము బొందు టాదిగ నిజామోదంబు సమ్మోహదా
యక మెంతేని స్వభోగోపభోగము నిపాతాపాదకం బబ్బుయా
నకతృష్ణావిషవల్లరీవితతిఁ గొన్నం దవ్వారిసాంబుచే
నకలంకక్రియఁ జెంపఁ గంటి నిక ముక్తావస్థ నా నెట్టిదో॥ 76

వ॥ మీ నుడివిన యా తత్త్వచింతనంబు సేయు విధం బెట్టిది నావుడు న
మ్మునీంద్రుండు. 77

గీ॥ విషయసంహతి నుండి తివిచి మనంబు
శూన్యమునఁ బొందుపఱుపు మశూన్యబుద్ధి
స్వపరికాశంబు నిరతిశయప్రమోద
రూపమును నై వెలుంగు నీ రూపుఁ గందు॥ 78

చ॥ అనుటయు నట్ల కాక మహితాత్మక! మీ యుపదేశముఁ గాన మనం
బున మననంబు సేసికొనఁ బోయెద నల్లదె కానవచ్చు ని
ర్జనవనవాటి కంచు నృపసత్తముఁ డేగుచు నుండ సిద్ధుఁ డ
జ్జనపతివెజ్జఁ బోయె గుణశాలిని శిష్యు గుఱుంచు వీనునే॥ 79

వ॥ అది యంతయు నెఱింగి దేవతిలకుం డహా! యి యోగీంద్రుండు
మత్ప్రార్థనంబు రిత్తసేయక నిమిషమాత్రంబున నరేంద్రుం దెచ్చి శ్మ
శానవాటికిం బాపి నవవాటం జేసినవాఁడు నేనును నటఁ బోయి
యనంతరకరణీయంబునకుం బ్రయత్నించెదఁ గాక యని. 80

గీ॥ ఉపవనంబున కేగి యా యోగివరుని
గూడి యం దొకచోటఁ దాఁ గూరుచుండి
నిశ్చలధ్యానకలనావినిష్ఠితాత్ముఁ
డైన య న్నరనాయకు నచటఁ గాంచి॥ 81

సీ॥ పటుశక్తిఁ గుదియింపఁ బడుచున్న ఘనశోక
జలధితరంగసంచయము నట్లు
బహిరింద్రియశ్రేణి పరగుచున్నని యచం
చలవృత్తి యొంటియు సంఘటిల్ల
నవియ యస్తైరు నెవ్వఁ డతిశోకదావపా
వకశిఖాసంప్రదీపనవిభావ
భాజనస్థితి నిలుచు బహిరింద్రియశ్రేణిఁ
దగనిరోధించక ధరణి నెందు

గీ॥ నల్పమైనను నిర్వాణ మందఁ గలఁడు
శాంతుఁ డగు నింక నృపుఁ డేల సాశయింప
నరుచు నటఁ జేరి యొకచోట నధివ నెగట
సవినయంబుగ నుండె నా సచివరుఁడు॥ 82

వ॥ అప్పు డన్నరపతి సిద్ధపతిం జూచి దేవా! యనిర్వచనీయం బగు
విజ్ఞానసుఖాస్వాదం బొం దుదయించు చున్నది నావుడు నదియు య
భ్యాసపాటవంబునం బూర్ణానందరూపం బై నిలువం గలయది తత్సా
ధనం బగు నష్టాంగహఠయోగంబును సముచితంబున నుపదేశింతు
నని య మ్మహాత్ముండు నుడివిన మహాప్రసాదం బిది యంతయు వరంబ
కాక యని య వ్విభుం డూఱకుండె న య్యనసరంబున॥ 83

గీ॥ వసుమతీశ్వరుఁ డీ సిద్ధవరుని వలన
శాంతిసుఖ మందుచున్నాఁడు సమయ మిదియె

యని యమాత్యుండు నృపుఁ జూచి యధిప ! దేవి
కగ్నిసంస్కారమున కింక నానతిందు ॥ 84

గీ॥ అనుటయును నది వినియును విననియట్ల
యధిపుఁ డుడుగక వెండియు నట్ల యడుగఁ
జిఱునగవు నెమ్మొగంబునఁ జెంగలింప
నవసరంబు వ్యతిక్రాంత మయ్యె ననుచు ॥ 85

ఉ॥ ఆ మమకార మున్న సమయంబున మంత్రివి నీవు మాకు ; నీ
కేమియు నానతీ గల మహీశుల మంత్రియ కాని సద్గురు
శ్రీమహిమోపలబ్ధశుభసిద్ధిసమగ్రుల మైత్రి నిష్ఠ త
త్కామమహావిమోహతరుకాండము కూల్చి వేళ్లతోఁ బడెన్ ॥ 86

క॥ కావున నాజ్ఞాపనవిధి
కీవ యొడయఁ డగుదు వొల్ల వేనియును భవ
ద్భావరపుత్రుం డొడయఁడు
నా విని యమ్మంత్రి మునిజనప్రభుతోడన్ ॥ 87

గీ॥ సంయమీంద్ర ! కాలసర్పదంశనమునఁ
దేలువిసము వెడలఁ దీయఁ దగునె
యనుచు నగవు దోప నాఁడినఁ గని సిద్ధ
వరుఁడు పలుకు మంత్రివరునితోడ ॥ 88

క॥ నను దూర నేల యిమ్మెయి
ననఘా ! పతి శోకసులభ మగు నిర్వేదం
బున నున్నవాఁడు నే ని
న్ననువర్తించెద మరల్పు మయ్య చతురతన్ ॥ 89

ఉ॥ నావుడు దేవిఁ జూచి నరనాయక ! మున్నవనీతసంవిదం
డై విపులోగ్రతేజము సమర్థతఁ జక్కఁగఁ గాచి పాకసం
భావన సూకసంకలనభంగిఁ దలిర్పఁగఁ గూర్చికొన్న మో
దావహరాజ్య మాజ్యముక్రియన్ రుచియింపక యున్న దేనికిన్ ॥ 90

గీ॥ అనుటయు నృపాలుఁ డ య్యమాత్యవరుఁ జూచి
సరసదరహాసరేఖ యాస్యమున వెలయ
మున్న చెప్పితి విను మంత్రిముఖ్య! యట్టి
యవసరంబు వ్యతిక్రాంత మయ్యె ననుచు ॥ 91

శా॥ కాలవ్యాల విషానలోగ్రపటుదుఃఖాపాది దోషజ్వర
జ్వాలా తీవ్రవికారవాంతిజనితశ్రాంతిం గడుం దూలి యి
ట్లోలిం భుక్తవిపాకదోషశమనోద్యోగంబు మై నున్న నా
కేలా మధ్వభిఘారితాజ్యసదృశం బీరాజ్య మిం వయ్యెడిన్ ॥ 92

క॥ అనిన విని దేవశీలకుం
డః ఘూ! నిజభుజసమార్జితానూనమహీ
ధన మైన మానసావ
ర్జన మొనరింపంగ నేల చాలదనవుడున్ ॥ 93

గీ॥ ప్రాణిపీడనమునఁ దన్నుఁ బడయ వలయుఁ
బ్రాణములు నొవ్వఁ బిదపఁ గాపాడ వలయుఁ
బ్రాణసంకటకారి యల్పవ్యయంబు,
నర్థము స్వనాశమునఁ బ్రాణహాని సేయు ॥ 94

క॥ అర్థ మనర్థం బనుట య
థార్థము సుఖ మొక్క లేశ మైనను లేద
య్యర్థసమర్థత గల యకృ
తార్థునకుం బుత్రుఁడును భయదశత్రుఁ డగున్ ॥ 95

క॥ అనుటయు నకట! యిస్సీ
యనితర సంప్రార్థితంబు నరయ నధన్యం
బును నగు నైర్ధన్యము నెడ
జనవర! బహుమానదృష్టి ననునే యనుచున్ ॥ 96

వ॥ అ య్యమాత్యుండు పలికిన నమ్మహీవిభుండు వెండియు ని ట్లనియె॥ 97

చ॥ పరిజన మాననేయదు నృపాలురతోఁ బగ రాదు శంకయుం
బొరయుదు దొంగకై యడలిపోఁ బని యుండ దధన్య మట్టి పే
దరికము ధన్యమట్టి ధనితాస్ఫురణం బగుఁ గాక యా తటి
త్తరలసుఖైకలోలుర పథం బది మాకు రుచింప ది య్యెడన్। 98

వ॥ అవిన విని య మ్మంత్రివరుండు దేవా! సుఖోపనత యై యెల్లతెఱం
గుల హృదయామోదిని యై యున్న యి మ్మేదిని ని ట్లవమానింపం
దగు నే యనవుడు న వ్విభుండు. 99

సీ॥ అసదృశౌదార్యవీర్యార్జవలావణ్య
కలన నెంతయుఁ బ్రీతిఁ గడలుకొలిపి
దిక్కాలానురక్తిఁ దలిర్పఁ గానెలి
కడనన్న తొంటి య వ్వసుమతీంద్ర
నక్కట! యల్పభుక్తాపరక్తులఁ బోలె
వెనువెంట నప్పుడ విస్మరించు
జనవాక్ఛలమున నుత్సంగసంశ్రితఁ జైన
దయితు నేనియును నిర్దయతఁ దెగడు॥

గీ॥ వారకాంతయు పోలె ని వ్వసుధ యేష్య
దేన్యదభినవరమణాగమేచ్ఛఁ జూపు
నెలమి నను బహుమానించు నేని దీనిఁ
బరగ నే నేల యిబ్బంగిఁ బరిభవింతు। 100

ఉ॥ ఇంచుక మెచ్చ దిప్పుడగు నెంత భరింపడి ప్రోచు చున్న ద్వే
షించుఁ బ్రవల్గదశ్వఖురసీరవిదారణు లైన వీరులం,
గొంచ కనిం బ్రియాసువులఁ గోలుపడుం దన కై యెవండు, త
త్ర్పాంచిత దేహరక్తపటుధారలు గ్రోలి సుఖంచు నిచ్చలున్। 101

క॥ నావుడు భూవరుఁ గనుఁగొని
దేవతిలకుఁ డధిప! భూపతిపదం బిది సం
భావితబహుజనార్జిత
పావనకర్మఫల మేల పాసెద వనుడున్। 102

ఉ॥ భూపతి యన్న రోగములు వోవు భయంపడి, దర్పవహ్నిసం
తాపముచేత శోకములు దవ్వు దొలంగవు, రాక యుండ వే
యాపదలుఁ, గృతాంతుఁడు మహాప్రభు డీతఁడటంచుఁ బ్రాణముల్
వాప వళిక్షుఁ డై చనఁడు, పార్థివతామద మింక నేటికిన్ ॥ 103

క॥ అనుటయు మిముఁ గని యిమ్మై
వనటం గడు నేడ్చు బంధువర్గము విడువం
జనునె నరనాథ యను నా
తని మోముఁ జూడ్కి నిలిపి ధరణిపుఁ డనియెన్ ॥ 104

క॥ పరవాపు లైన చుట్టలు
పరలోకప్రవణుఁ జూచి పరిణామమునం
బరమాహ్లాదము నెందుదు
రరయం దదితరుల చంద మది యెట్లన్నన్ ॥ 105

చ॥ మనమున నుల్లసిల్లుచు సమున్నతిం బలవింత్రు నాశనం
బునకు, బ్రియ్వృద్ధికిం గడుఁ బ్రమోదము నూపుదు రాత్మఁ గ్రుళ్లుచున్,
ఘనతరసంపదన్ బహుసుఖంబులఁ దేలుచుఁ దిట్టుకొందు, ర
జ్జనములు చుట్టలైన నిఁక శత్రువు లెవ్వరు ? చూచి చెప్పుమా॥ 106

వ॥ అనినం దేవా ! యట్టినఁ దాదృశు లగు నాబంధువులచేత నేనియుం
బరులచేత నేనియు ని య్యవని యాక్రమింపం బడున యేని నెట్లు స
హింపఁ దగు ననుటయు. 107

ఉ॥ వీరు మదీయు లేను మఱి వీరల వాఁడ నటంచు మూఢు లై
యారసి పుత్రబంధువిహితాహిత భేదము నూపు చుందు రె
వ్వారును దాదృశభ్రమము వాసె నిఁ కేరికిఁ బోయె నేమి యి
ద్ధారుణి పాపకారిణి వృథావ్యథఁ జెందదు నామనంబు నాన్ ॥ 108

క॥ దేవతిలకుండు వెండియు । దేవీ! యో రాజ్యలక్ష్మి తెగితివె యకటా!
నీ వని వాపోవుటయును। భూవరుఁ డెలనగవు వదనమున బొలుపారన్ ॥109

సీ॥ కాలకూటకటుత్వకలనఁ గైకొనెఁ గాని
యమృతంపు మధురిమ నంటికొనదు
సలిలక్షరద్రూప మలవరించెన కాని
సురగురుత్యాగవైఖరి గ్రహింప
దౌర్వాగ్ని వేఁడిమి నభ్యసించెన కాని
యిందుశీతలభావ మందికొనదు
కల్లోలచపలతాగరిమఁ గాంచెన కాని
చింతామణిస్థైర్యసిద్ధిఁ గనదు॥

గీ॥ బహుదురర్థానుబంధిని, పాపమూర్తి
తెగినఁ దెగ నిమ్ము లచ్చికై వగవ నేల
యని పలికి వేఁడి యిట్లను న య్యమాత్య
వరుని మొగమునఁ జూపులు నెరసికొనఁగ। 110

సీ॥ నహుషుండు స్వారాజ్యమహిమంబు గోల్పోయి
యొక కొండచిలువ యై యుర్విఁ బడఁడె
జైవాతృకుఁడు నిజాచార్యు దార గ్రహించి
సంతతక్షయబాధ సమసిపోఁడె
నింద్రుండు గౌతము నిల్లాలి కాశించి
యొడ లెల్ల యోనులై పుడమిఁ దోఁగఁడె
బలి విష్టపత్రయోజ్జ్వలవిభూతి వహించి
తెమలి పాతాళమూలమునఁ దెరలె

గీ॥ నిందలును సంకటములం దివేఁడంగు
టింతి యుండఁ గదా ! పార మెఱుఁగలేక
ప్రకటసంసారజలధివీచికలఁ జిక్కి
చిక్కువడి పోయి రింకేమి సెప్ప వలయు। 111

మ॥ అనిశ దైవతపూజనాకలనసాధ్యస్వర్గసౌఖ్యైకసా
ధన మీరాజ్యరమాకటాక్ష మది నీ దానా! సదర్థానుబం
ధిని గా కుండెడుఁ బార్థివేందిర ధరిత్రీనాథ నా నాతఁడి
ట్లను నమ్మంత్రివచం గడుంగొని సముద్యత్సారవాచాస్ఫురిన్। 112

గీ॥ అనఘ ! భగవంతుఁ డైన నారాయణుండు
సచ్చిదవబోధమాత్రప్రకాశియుండు
సర్వభూతాధివాసి విశ్వమయుఁ డాతఁ
డలర వేల్పుల గొడవ యే లయ్య మనకు ! 113

సీ॥ వలచి కోర్కులు దీర్ప వెలివోని ధనముండఁ
విటులకై పొరుగిండ్లు వెదుక నేల ?
జ్వలదుగ్రతేజుఁ డై వెలుఁగు పావకుఁడుండ
వెడమిడుంగురులకై యడర నేల ?
పండువెన్నెల లెందుఁ బండు చందురుఁ డుండ
మినుకుఁబురువులకు నై మిడుక నేల ?
కడలొత్తి పాఱు గంగాప్రవాహం బుండ
ముఱికిగుంటలకు నిట్టుఱుక నేల ?

గీ॥ యమృతరస ముండ మందుల కరయ నేల ?
రాచసిరు లుండ మెదుకు లేరంగ నేల ?
యాత్మ యై లోన నిలిచి నారాయణుండు
వెలుగు చుండంగ వేల్పులఁ గొలువ నేల 114

వ॥ అనుటయు నద్దేవతిలకుం డ వ్విభుం జూచి దేవా ! అది యట్టిద య
గుం గాక! యట్లైనను, జవ్వనంబున నుపభుక్తవిషయుండ వై తనిసి
యవ్వల వితృష్ణుండ వగుదు వేనియు ని వ్విజ్ఞానంబు సార్థకంబున కొ
క్కింత కార్యకారి యయ్యెడుం గాదె నావుడు, వెండియు న వ్విభుం
డి ట్లనియె ! 115

క॥ ఉపభుక్తవిషయుఁ డను నది
విపరీతక్రమము సేత వెర వ ట్లగుటన్
నృపసచివ ! విషయతతిచే
నుపభుక్తుం డనుము మనుజు నుజ్వలఫణితిన్ ! 116

గీ॥ విషయవితతి ననుభవించు చున్నాఁడ నే
నని మతిభ్రమమున నాడు మనుజుఁ

దదియ నిక్క మైన న విషయేచ్ఛయ
విషయసిద్ధిపిదవ వీఁల కున్న ॥ 117

గీ॥ అట్టు లగుటఁ జెఱకు నట్టు ల విషయముల్
పీ్రితి నరుని బీల్చి పిప్పి చేసి
తనిసి వార్ధకమునఁ దా బెండువఁ జూచి
విరసబుద్ధిఁ దామ వదలి పోవు॥ 118

వ॥ మఱియును.

గీ॥ అజయు నజము ననుట యాకారకృతభేద
కలనఁ గాని యొందు గాని యట్లు
విషము విషయ మనెడు పేర్పాటు జనమృషా
కల్పితంబ కాని కాదు నిజము ॥ 119

వ॥ వార్ధకంబున విత్ఫష్ణుండ వైనం జాలు నని యుపదేశించితి వదియు
నుం జెప్పెద వినుము. 120

ఉ॥ పాపపుఁదృష్ణయెల్ల నెలఁబ్రాయమునన్ వెడలింపరానిచో
నోపిక నట్టి యెంత శ్రమ మొందిన నవ్వల వీడి పోవ దు
ద్దీపనకారిచుమ్వై భువిఁ దృష్ణకు వార్ధక మట్లు గానఁ దా
నేపున దాని నాపయ జయింతు వ టన్నది వట్టిదే సుమీ! 121

సీ॥ దంతపంక్తికిఁ గల దార్ఢ్యంబుఁ జికురసం
పదకుఁ బ్రాపగు తమోమలినరేఖ
తనరు కన్దోయి తత్తద్గ్రాహకత్వంబుఁ
దనువున కున్న యత్తరుణిమంబు
వాయుష్యమునకు నిం పగు దీర్ఘభావంబు
ననువానిఁ, వటుజరావ్యాధి కతనఁ
బరిభూత మైన యా ప్రాణికిఁ గలవాని,
నశరణస్థితిని నల్లాడువాని,

గీ॥ నా తవగ్గవిభూతి నొ ప్పారువాని
నవదృశోత్సాహకలనఁ దా నావరించి
పావపుందృష్ణ సంతోషభరిత యగుచుఁ
ద్రుళ్లి పడు నది ముదిమిచేఁ ద్రుంగు నెట్లు । 122

వ॥ అనిన న మ్మాటలకు నిరుత్తరుం డై య య్యమాత్యసత్తముం డింక
ని మ్మహీవిభుండు తొంటి తెఱంగునకు మరలుట యసంభవం బని
తలంచి య య్యోగిపుంగవుం గనుంగొని నిట్టూర్పు పుచ్చి మహాత్మా!
యెయ్యది కర్తవ్యం బనుటయు నతండు. 123

క॥ జనవర ! యీ వైరాగ్యం
బున కంతకుఁ దాన బీజభూత గదా ! యా
వ్వనజాక్షి భానుమతి యా
మెను జూలిము ర మ్మటంచు మెయిగొల్పి తగన్ । 124

క॥ తన వెంట తేనిఁ గొని చని
కనుఁగొను మని సకలసిద్ధిఖని య మ్ముని యా
తనికి నిజయోగశక్తిం
బునరుపగతజీవ యైన పొలఁతుకఁ జూపెన్ ॥ 125

వ॥ అంత నట్లు నిజమహిమంబునం బునరుపాత్తజీవితయైన య ప్పురంధ్రీ
రత్నంబు సూపి యామె కింకను స్మరణంబు రాకమున్న శుద్ధాంత
కాంతాజనయోగ్యం బగు యానంబుఁ దెప్పించి యం దెక్కించి
యంతిపురంబు సేర్పం బంచి ము న్నామె నిలిచి యున్న ద్వారదేశం
బునంద వరుండం బెట్టించి యా సిద్ధవరుండు మనజవరు నందుండ
నియమించి పరివారంబు నెల్లం బోవ నాజ్ఞాపించి తానును నంతర్హితుం
డయ్యె నని యి త్తెఱంగున. 126

క॥ పుణ్యానిధి యైన ముని ప్రా
వీణ్యము ప్రకటితము గాఁగ వేంకటసుబ్ర
హ్మణ్యకవి సకలబుధజన
గణ్యముగ రచించె దీనిఁ గమనీయగతిన్ ।

శ్రీశారదాయైనమః.

# భర్తృహరి నిర్వేదము.

## తృతీయాశ్వాసము.

క॥ పింగజటాకిసలయచయ,
గంగాంబుకణప్రసూనకలికావ్రజ, సా
రాంగాంకఫల, సురద్రుమ
దంగా! శ్రీశైలమల్లికార్జునలింగా! 1

వ॥ దేవా! యవధరింపు మట్లు సిద్ధప్రభావంబునం బునరావృత్తజీవిత
యైన య బ్భానుమతి య య్యంతఃపురద్వారదేశంబు జేర్పం బడి
యుండి కొంతసేపటికి లబ్ధసంజ్ఞ యై యల్లన లేచి తన ప్రాణేశ్వరుం
గాంచి సంతసించుచు లేవ నుంకించి య ప్పనికిం జాలక నిస్సహానిష్ఠా
మంబు లగు నిజాంగంబులు వట్టి యెత్తం బ్రార్థించిన నతం డూఱ
కుండుటయు నామె విలక్షవదన యై నాథా? యేల పరాఙ్ముఖుండ
వైతి వని యడిగి సదుత్తరంబు గానక యక్కటా? నా దేహస్పర్శం
బునందును నింత వైముఖ్యంబు నొందం గారణం బేమని యడిగిన
నతండు. 2

గీ॥ ఏను మరణించు చున్న నీ విట్టు లసుహ
యుక్త వయ్యెదు గావున యోగశక్తి
నిందుకుఁ బ్రతిక్రియార్థి నై యేను నజర
మమరమును నైన పద మంద నాసపడితి॥ 3

చ॥ అనుటయు న వ్వెలందుక భయంబున, మాటల ప్రేగు సూడ ని
జనపతి నన్ను వీడి చనుచందము దోఁచెడు నట్లు తన్నివ
ర్తన మొనరించు దాన నౌ కదా! యని యైనను జూత మంచు నా
తని వదనంబునం గనలు దార్కొను చంచలదృష్టి వైచినన్॥ 4

వ॥ అప్పు డమ్మనుజేంద్రుఁడు తన మనంబున.

చ॥ ఇవె తరలాబ్జపత్రనయనాక్షిసరత్పటుకాలకూటకా
టవకుటిలంబులై చను కటాక్షము లియ్యవి మీఁద వ్రాలినన్
వివశతఁ గొంత సేపు గడు విహ్వలమై యిదె నాదు మానసం
బవిరల మోహసంతమసమందు వడిం బడిపోయె నొక్కటన్ ॥ 5

గీ॥ అధికదుస్సహ మార ! తొయ్యలుల తరళ
భావభంగురదృక్ఛటాపటునిపాత
మది మనంబున సుపిపక్వ మయ్యె నేని
యివ్వివేకవరాక మిం కేమి సేయు ॥ 6

క॥ అని పలుకు చుండఁ బతి యా
ననమునఁ బొడకట్టు మాఱ్పునం గొంత ముదం
బునఁ బొదలి ప్రాణనాథుం
డనుకూలుం డయ్యెఁ జూత మని చెలి మరలన్ ॥ 7

క॥ స్మితభంగురమధురంబుగఁ
బతివదనము సూచె నా నృపాలతనయ భూ
పతి చూపు నివారించుచు
నతివకు ని ట్లనియెఁ దొంటియాకృతి దోఁపన్ ॥ 8

గీ॥ అంతరావృతి దొలఁగిపో వెంతవఱకు
నంతవఱకును జెలుల యానంగి యైన
చారుదృగపాంగభంగి యో ! జలజనయన !
వినుము ! తామసి యగు మసీవృష్టి సుమ్ము ॥ 9

క॥ అనుటయు బాష్పజలంబులు
చనుకట్టులఁ దొట్టి పాఱ జలజాయతలో
చన హా దైవమ ? యీ నూ
తనతావకపరిణతికిఁ గతం బెట్టి దొకో ! 10

వ॥ అని వెచ్చ నూర్చిన నవ్విభుండు వెండియు.

శా॥ త్యక్తాస్వాదుఁడ నైతి నిప్పు డవసాదత్రాసవిస్ఫూర్తి, ని
ర్ముక్తం బైనది కామ, మేమిటికి నో ముగ్ధా! స్మితస్ఫార వి
ద్యుక్తారత్నము సూపె దివ్వగిది నిం కేలా వృథాభ్రాంతి స్ని
గ్ధోక్తుల్ ప్రౌఢవిలాపముల్ పనికిరా వొక్కింతయున్ నాయెడన్॥ 11

సీ॥ ఆత్మనిర్గమనంబునందు సద్భక్తి
సారంభ యైనప్పు డారంభ యైన
మనసు నోనాడు స న్మహిమచే
మరువిల్లు నలి యైననాడు మేనకయు నైన
తనువుపై రోసి చిత్తవశీకృతిస్ఫూర్తి
వఱలు న ప్పేళ నూర్వశియె యైన
మాయ జయించి మైమఱచి యున్నెడ
భావభరిత యై యొప్పు న ప్పుడతి యైన॥

గీ॥ భావజోన్మాదకరణప్రభావకలన
వానిపై లీలఁ బ్రేరేచి వనము చేసి
యిచ్చమై నాట లార్పఁ దా నేను నేర్తు?
నింత యెఱుఁగవు నీవు పూర్ణేందువదన॥ 12

వ॥ అనిన విని యారాజనందన హాసప్రియవల్లభ! నీ యుల్లం బొప్పిద యగు
నేనితొల్లి జనకాదులకుం బోలె నీకును నీగృహస్థతయందు విజ్ఞానంబు
సులభంబు గా కేమి నావుడు. 13

గీ॥ అమ్మహానుభావు లగు జనకాదు ల
నేకజన్మసిద్ధు లింతి! వార
లెట్టు లున్నఁ జెడరె దేమి జీవన్ముక్తు
లైన వార లేశ? నే నిజేడ? 14

క॥ జలజాక్షి! యపక్వకషా
యుల మగు మమువంటి వారి యుద్యోగంబుల్
గలఁప మతి రొండు తెఱగున
ఫలసిద్ధిం బడయుఁ దగినభంగివి చుమ్మా॥ 15

చ॥ ఉరుతరసన్గురూపసదనోన్నతిఁ జిత్తము లాగికొంటి దు
స్తరబహులాంధకూపసదృశం బగు గేహమునుండి దానిఁ గ్రి
మ్మరిఁ జెఱవట్టి యట్టి భవమార్గమునం బడఁద్రోవ నోవ నో
సరసిరుహాక్షి ! మున్ జెడిపచందము సాలదె యింక నేటికిన్ ॥ 16

క॥ అంతయు నెఱిఁగియు మున్ను ని
శాంతంబునఁ జేసియున్న సమ్యగనుష్ఠా
నాంతర మొకటియుఁ గనరా
దెంత వెదకి చూచినను శుభేక్షణ కంటే ॥ 17

శా॥ ఇష్టం బిష్టము నష్టనష్ట మగునో నీక్షించుచున్ శిష్టశి
ష్టేష్టార్థంబున గ్రాలి చిత్తము కడుం దృష్టానివిష్టంబ యౌఁ
గ్లిష్టకష్టవికర్మనిష్ఠఁబడి రక్తిం జేయుచున్ దుఃఖవి
భ్రష్టభ్రష్టనికృష్టసద్గతిఁ బరిభ్రాంతం బగుం గ్రమ్మఱన్ ॥ 18

సీ॥ తపము సేసితినె యుద్ధతి సన్న్యల మనంబు
లతివ ! తపింపఁ జేసితిని కాని
భజియించితినె హరిపాలి సంతోషదనాం
చితగృహావలి భజించితిని కాని
యుపసంయించితినె ద్రోహాలి ద్రోహాలి నూ
జ్ఞితచింత నవనయించితిని కాని
వినుతించితినె యచ్యుతుని నచ్యుతభ్రమో
న్నతిఁ గామినుల నుతించితిని కాని ॥

గీ॥ అకట ? యేమందు నేమందు ల మ్మహోగ్ర
విభ్రమవ్యాధి మాన్ప సేవింప వలయుఁ
బ్రకటమతి వానిసేవింపఁ బథ్యవర్త
నంబు వలవదె ? యని యాననంబు మలపి ॥ 19

క॥ లేచి చనుచుండ సరసిజ
లోచన వెసలేచి కితవ ! లోలన్మతి నన్
ద్రోచి యిటు లెందు బోవం
జూచెద వని కొంగుపట్టి సొలయించుటయున్ ॥ 20

క॥ ఆయుత్తరీయ మామె క
రాయత్తము కాఁ దొలంగి యటఁ జను చుండం
దోయజలోచన పలుగిడి
యాయన ముంజేయివట్టి నటుపట్టెటయ్యెన్ ॥ 21

వ॥ అ వ్విభుం డచ్చట నిలిచి సక్రోధంబుగా నోసి! దుర్గంధబహులా! యని
సంబోధించుచు ని ట్లనియె. 22

క॥ నిను స్నాయుబంధబంధుర
ఘనవాలకరాలచర్మకంథాపిహితా
స్థినికాయమాంసమజ్జా
మనఃక్రిమివిహారయోగ్యమలరాశివిఁ గాన్ ॥ 23

క॥ గనుఁగొంటెఁ దొంటి పనులిం
కను నన్ను వశీకరింపఁ గలుగునె నీ యుం
డనవరతము దోఁచు దురం
తని కాయము వినుము చెప్పెదను వివరముగన్ ॥ 24

సీ॥ గండాఖ్యరుజను దాకని చేయి ఘనకుచ
స్థూలమాంసంబుపై వ్రాలుటేమి?
శ్లేష్మాస్థిచర్మనిచితగర్త మంటని
పెదవి వక్త్రంబు చుంబించుటేమి?
శ్వసనోద్గమాగమవతి భస్త్రి నొల్లని
యెద నాతిమేనుఁ గౌఁగిలించుటేమి?
మలమూత్రసంచయాకులనరకము రోయు
నుల్లంబు చెలి రోయకుండుటేమి ॥

గీ॥ ఎంత లజ్జావిహీనత యెంత మోస
మెంతటి విమోహ మెంతటి హేయవృత్తి
యింత యెఱుఁగడు పురుషుఁ డిం కేమి సెప్ప?
మాయ కన్నుల గప్పి కోమలుల నమ్మ ॥ 25

వ॥ అని చేయి విడిపించికొని వెడలి పో నున్న యన్న రేంద్రునిం బోలిక
యకాశిరాజపుత్రి ప్రమోదనముఖరముఖాంబురుహ యై పాదంబు
లం బడుటయు నౌరా! విషయంబు లెంత దరతిక్రమణీయంబు లని
సఖేదంబుగా నాత్మగతంబున. 26

గీ॥ మొనసి యింద్రియములఁ బెనురాతిముదులుగా
మనసు వజ్రసారమయము గాఁగఁ
జేయఁ డేని విషయవశ్యత్వమునకు నె
వ్వఁడు ప్రయత్నసిద్ధి వఱలువాఁడు॥ 27

చ॥ అని తలపోయు చున్న సమయంబున నం దొక చోట సైకతం
బున నట మున్న యున్న నృపపుంగవు మంత్రి యొకింత ప్రమానుపా
టున నృపుఁ డుంటఁ గన్గొని కడుం జెన దగ్గఱి దేవ! యింక నై
నను గరుణింపవే నృపతినందినిఁ దత్ప్రణయంబు నూడవే॥ 28

క॥ అని వినయవినతుఁ డయ్యెం
గని యడుగులు దివిచికొనుచుఁ గమలాసన దా
విను చుండ మంత్రివరునకు
జననాయకుఁ డిట్టు లను ససంభ్రాంతమతిన్॥ 29

చ॥ ఎలుక యొకింత లేని మది కించుక మోదము సేయుఁ గాని క్ర
చ్చలఁ బరిపాకవేళ విరసస్థితి మోహము నావహించు దు
ర్భరవిషమిశ్రఘోరమదిరామధురాకృతి నట్టి భీతి సుం
దరి సమకూర్పఁ జాలును దథా విధసౌఖ్యము గూర్పఁ జాలునే॥ 30

సీ॥ ధైర్యంబుఁ బెలుచ విధ్వస్తంబు గావించు
బలితంపుసిరుల నిచ్చలు గ్రసించు
మానసంబునకు నున్మాదంబు పుట్టించు
జరణపాతములకు సవదరించు
సారతాంతమునఁ గుత్సామలం బొడఁగూర్చుఁ
గన్నార నిసుర వోఁ గడగ నీదు
నెమ్మి వర్తిలఁ నన్నదమ్ముల వేర్పాటు
జవ్వనం బెసలించి జర సమర్చు

గీ॥ నీకుఁ జేయని యుపకార మెద్ది గలదు
దాన యస్మత్ప్రశాంతి జగాన ననిన
నిజమనోనాథుఁ జూచి యన్నీలవేణి
యురుతరవ్యథ దోప నిట్టూర్పు పుచ్చి 31

గీ॥ ఆకట! యన్యోన్యపారవశ్యమునఁ జేసి
యెసగు నా యీ విలాసంబు లెందుఁ బోను
నింతలో ని ద్దురంతంబు లెట్లు వచ్చె
హాతవిధి! యని వలవింప నధిపుఁ డనియె, ॥ 32

చ॥ ప్రియుఁ డిదె యేఁగుదెంచె నిదె ప్రేయసి కన్గొనుమింక వెలంది నూర
దయితుని దృష్టి పంకరుహదామకవృష్టి ప్రియాంగ్రిసంగంబు ని
శ్చయ మమృతంబు ప్రేమ సమృశంబు వియోగము దుస్సహంబు నా
జయిగొను భావముల్ పృథ పాకవయఃపటురోగపుష్కల్ 33

వ॥ అనుటయు న ద్దేవశీలకుండు దేవా! సకలసు... యగు జవ్వనం
బు నిట్లు వ్యాధి యని దూషింపం బోలునే యనవుడు న ద్విషుండు
వెండియు 34

సీ॥ వ్యాధి గా కేమి సూవన మానస్వనాశగ
గతికిఁ దా నేకాంతకారణంబు
కదు దుస్సహం బైన కామజ్వరముఁ బెచ్చుఁ
గన్నుఁదోయికిఁ జికట్లు గొలుపు
ఘననితంబోరుహృద్గండదేశంబుల
కుల్బణం బెక్కించి యుడుకు లాప్పు
వివిధంబు లైన దుర్వికృతులు కలిగించు
హితుల నత్యంతదుఃఖితులఁ జేయు

గీ॥ గ్రహాణి యాకిగ నుండు రోగంబు లెల్ల
నింతకంటెను జేసిడి దేమి చెప్పుము?
నావుఁడును నెమ్మనమున విన్నఁదన మొప్ప
మంత్రివరుఁ డూఱకుండె న మ్మగువ కలఁగి 35

వ॥ నిజచేటి వాసంతికం బిలిచి యోసీ! నా ముద్దులపట్టిం గొని తెమ్ము
వాని మున్నిడికొని యార్యపుత్రుని యీ వ్యామోహంబు వారిం
చెద నని యది యట్లు చేయ నామె యక్కుమారుం జంకట నిడికొని
దీనవచనంబులం బ్రభూ! యి ప్పసిపాపని కింక రక్షకు లెవ్వ రనుట
యు న వ్విభుండు వైరాగ్యశోకశబలంబుగఁ దన మనంబున 36

చ॥ కల వొక కొన్ని భావములు గాఢవివేకముఁ గోలుపుచ్చఁ బె
ల్బలిమి గలట్టి వట్టి వొక పట్టి నెపమ్ముగ ముట్టి యెంతయుం
బలితము లైనచో మఱి యెవండు తదాంతరభావవేగముం
గెలువఁ గలాఁడ టంచుఁ బరికించు నెడన్ సదివుండు నెమ్మితోన్॥ 37

వ॥ దేవా! దేవి ప్రశ్నంబున కుత్తరం బీయం బోలదే నావుడు నా నృపా
లుండు। 38

చ॥ ఇతఁడు మదాత్మజుం డనెడు నెమ్మి యు నమ్మిక యెల్లు చెల్లు సా
క్షితయు వెలుంగు నాత్మయెడ, గేవలముం జను వన్నచోఁ దనూ
ద్గత మది, దానఁ బ్రాక్తనము కాఁ జడు నాత్మ జనించు టెట్లు? త
త్ప్రకృత ఘటించు టెట్లు వినివృత్తతనువ్యవసాయశాలికిన్। 39

వ॥ ఒకవేళ నీ జన్యజనకభావం బాత్మవిష్ణంబు కాఁ దలంతు మేని యు॥ 40

గీ॥ దైవరక్ష్యంబు విశ్వ మంతయుఁ దలంప
దైవసముపేక్షితముఁ గావఁ దరము గాద!
యారయంగ బ్రమీతకుమారకుల ద్వి
జాగ్రణికిఁ దెచ్చి యిచ్చిన హరికిఁ దక్క। 41

వ॥ అనుటయు న ద్దేవతిలకుండు బాలు నుద్దేశించి కట! కటా! యని
వగచుచు. 42

మ॥ విలసత్స్నేహాభరాలసాంతరసుఖావిఖ్యాతి రాఁ జేరి ని
ట్టలపుం గూర్మి నిజాంకపీఠి నిడి క్రీడాలంబిలోలాలకా
వలిఁ గేలన్ సవరించు చుం డుడుతు రె వ్వా రింక నిబ్బాలు ని
స్తులవక్త్రాంబురుహంబుపైఁ బాలయు పాంసుశ్రేణి వాసోదరన్। 43

క॥ అనుటయు నీదృశలలితవ
చనములు ధర నేరి హృదయసామజమున కెం
దును శిశిరాంకుశములు గా
వని తలఁచుచు నిట్టు లనియె నతఁ డాతనితోన్॥ 44

గీ॥ ఇట్టి భావంబు కతమున నేనిఁ గలుగ
నేర్చు మాలిన్యమున నిత్యనిర్మలస్వ
భావ మగు నాత్మ కే మగు భవ్యచరిత
ఘనకృపాణంబున దర్పణంబునకుఁ బోలె॥ 45

వ॥ మఱియును.

గీ॥ వెలఁది యనుచు గాయమునకుండి వెడలుచుండు
శోణితక్లేదశేషప్రపూర్ణ మైన
శ్రీమిగదా! వ్రతుల్గఁ దనంగ నిర్మమతఁ బొడలు
నాతనికి దానిపై నేటి యాదరంబు॥ 46

క॥ నాప్రేఁమ మంత్రివరుం డ
బ్జాభవకానిం గాంచి బుధుండు ప్రాణుని స్వర్గ
శ్రీసంభవహేతు వని సం
భావింతురు నీవిఁ దోఁపఁ బాడిమె యనిన॥ 47

చ॥ చిరపరిచీర్ణదుఃఖములచేత జనించు వినాశధర్మిమై
పరువడిఁ బెక్కు శంకలకుఁ బాల్పడుచుండు స్థితివేళ, నూర్వ్యథా
కర మయి తద్వినాశ మతికష్టముఁ గూర్చు, స్వరాదిసౌఖ్య మం
దురునుతు లంత ప్రీతి పడుచున్నద నాపద లేల యొల్లరో॥ 48

వ॥ సుఖంబుల తెఱం గిట్టి దగుటం జేసియ కదా! పెద్దలు జీవితంబునం
దెన్ని దుఃఖమర్దనంబులు ననియె నెంతటి సుఖదుర్యోతికాలాభంబు
పడయుం గలిగితి మని భావించుచుందురు మఱియును. 49

క॥ విను బ్రహ్మానందఘనాం
బునిధానకణంబు స్వాపవిముఖ మైన సుఖం

బనభూ ! యీ యల్పసుఖం
బున కై యే నేల తద్విముఖత వహింతుర్ ॥ 50

వ॥ అనుటయు న ద్దేవతిలకుండు రాజాశ్రితంబు లగు సంపద్విశేషంబుల
కింక నెయ్యది ప్రకారం బనుటయు న వ్విభుండు. 51

గీ॥ భోగలాలసుఁ డగు నన్నుఁ బురుషు నొకని
నెల్ల సంపదలును నాశ్రయించుఁ గాత
కామమోహమదక్రోధగణము నన్ను
వీడి తమ యిక్కవలు సూచి విడియుఁ గాత ॥ 52

వ॥ అని బద్ధాంజలి యై వెండియు.

ఉ॥ జానుగ నన్నుఁ బట్టికొని శ్రోత్రప్రదేశమునుండి పాచి వి
జ్ఞానము బల్మి పై నిడె నెసం బరవస్తువునందుఁ జేర్చెదుర్
దానికి నగ్గిఁ బోక గురుదైవతవిప్రగణంబులార ! యి
య్యానిసి గాఢసత్కరుణ మన్నపుడు మీకు నమస్కరించెదుర్ ॥ 53

వ॥ అనటయుం బ్రభూ ! నీ విట్లు దారిద్ర్యంబు వలచి తెచ్చికొనినయెడన
యేని శరీరయాత్రయు దుర్ఘటంబు గాదే? నావుడు న మ్మంత్రివరున
క బ్భూవరుం డిట్లనియె. 54

మ॥ సరసానేకగృహాన్నభక్షణము, స్వచ్ఛందాటనక్రీడ, సం
స్తర మెన్నగ మృదుకంథ, నిశ్చలతరుచ్ఛాయానివాసంబు, సు
స్థిరవిశ్రాంతిద మైన సంచరణముల్ శీతాతపోపాసన
స్ఫురణల్ స్వేచ్ఛయు నట్టి శాంతిసుఖముం బోల్పన్ సుఖం బున్నదే

వ॥ ఇంతియ కాక యియ్యెడలి భరణాయాసంబునుం గార్యంబు గా దది
యెట్లు లం టేని వినుము. 56

ఉ॥ ఆయువు బిందుమాత్రము మహారయవాహినిఁ గాలవాహినిం,
గాయము తద్వశంవదము కాఁగ నెఱుఁగుదుఁ మెయ్యెయిం గత

ప్రియము, దాని కేల వగవం, దర నుండిన నుండఁ బోయినం
బోయె, నతండు గాఢసుఖమూర్తి చిదాత్మ వెలుంగుఁ గావుత౯। 57

మ॥ యమసంబంధిని యాజ్ఞ నేరెఱుఁగ రాహా! యెందు రాజ్యాదిభో
గము లెవ్వైన నరులం త్యజించునవియే కావయ్య ' మోసంపుభో
గములం జిక్కక యేమ వాని నువివేకస్ఫూర్తి ముమ్మన్న వే
తెమలింపం గలవార మైన నది యెంతే మేలు చేకూర్పదే? 58

సీ॥ స్వవికల్పనస్ఫూర్తి సంకల్ప మను శిల్పి
చిద్వ్యోమపట్టికఁ జీర వ్రాసి
పెనుపారఁ జూపు నిర్భిత్తికం బైన వి
చిత్రచిత్రిమ యీ యశేషజగము
ఘనులు కొందఱది నిర్మనస్వప్న మందురు కొం
దఱు దీని మాయావిధాన మంద్రు
కొందఱి యొది నభోగోచరనగరిగా
భావింతు రిదినికై పలువ నేల

గీ॥ యని సదుత్తర మిచ్చిన వాత్మ మెచ్చి
సంయమీంద్రుండు నిర్వాణశాలిజీవ
కోటిఁ గడుమేటి వై యొప్పుఁ గొఱలె దనుచు
సచివవరుఁ జూచి తనదు నిశ్చయము సెప్పె॥ 59

వ॥ ఇట్టి నిర్బంధంబునం బ్రయోజనంబు లేదు రాజ్యంబునకు రాజపు
త్రుం బట్టంబు గట్టి సుఖం బుండు మేనును రాజుతోడం గూడి తత్త్వా
ర్థి నై యిందు వసించి యుండెద ననుటయు న మ్మంత్రివరుండు
నిట్టూర్పు నిగుడం జేయు నది లేక మహాప్రసాదం బని యందుల
కంగీకరించె నంత నితాంతచింతాక్రాంతహృదయ యై యేడ్చుచున్న
రాజపత్ని నుచితవచనంబుల నూరార్చి రాజుం జూచి కుమారా!
యింక నను నీ కెయ్యది ప్రియంబు కోరు మనవుఁడు దేవా! యింత
కంటెను బ్రియం బొందుగలదే యని యూఱ కుండుటయు నమో
ఘవచనుం డగు నా సిద్ధపుంగవుం డి ట్లనియె. 60

సీ॥ సాధుసజ్జనుల కుత్సాహంబు రెట్టింపఁ
దత్కార్యసిద్ధి వెస్ధవులుఁ గాత
సకల ప్రజానురంజనకళావిస్ఫూర్తి
నవనిఁ బాలింత్రు గా కఖిలనృపులు
పరగ నక్షతపక్షపాతమాధుర్య మై
యులరుఁ గావుత లక్ష్మి యార్యులందు
నాత్మబోధాపగమార్థు లై కూడిన
త్వద్బంధుతతిఁ బ్రీతిఁ దరలు గాత

గీ॥ ప్రకటహరిహరకీర్త్వవిస్తరంబు ధాత్రి
హరిహరశ్రీపదాబ్జముక్తాళి యైన
యస్మత్కులాన్వయు నాంధ్రభాషానువాద
కలన రసికుల మదికి వేడ్కలిడు గాత॥ 61

వ॥ అని యాశీర్వదింప సంబటు నిర్గమించి ఈ విధంబున భర్తృహరి నిర్వేదం బను నీతత్ప్రబంధంబు సర్వంబును సంపూర్ణం బయ్యె. 62

శ్రీ కృష్ణార్పణమస్తు.



రాయలసీమ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

# తప్పొప్పుల పట్టిక.

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 7 | కలకండ | కలకంఠ |
| 4 | 17 | దెపు | దెప్పు |
| 11 | 6 | పఱపి | బఱపి |
| 13 | 18 | నడిగిన | నడిగి |
| 16 | 8 | ప్రీనైము | ప్రీతినైము |
| 17 | 14 | యామాత్యు | యమాత్యు |
| 18 | 1 | సబ్రిహ్మ | సుబ్రహ్మ |
| 20 | 6 | నందిని | నందని |
| 20 | 11 | జేగుప్స | జుగుప్సి |
| 24 | 13 | మహిమంబు | మహిమంబున |
| 24 | 15 | నైాయది | నైనయది |
| 24 | 24 | చేటున | జేటున |
| 27 | 6 | దోంచె | తోంచె |
| 27 | 14 | వగుచు | వగచు |
| 28 | 17 | సపు | నష్టు |
| 29 | 15 | గలకంసే | గలంకసే |
| 31 | 3 | నంరేందా | నరేంద్రా |
| 34 | 23 | నైర్ఘన్య | నైర్ధన్య |
| 35 | 10 | గానెం | గానెలి |
| 35 | 21 | దశృ | దశ్వ |
| 37 | 23 | జకృ | జికృ |
| 38 | 3 | భూతాధి | భూంతాధి |
| 46 | 23 | పుట్టిచు | పుట్టించు |
| 47 | 12 | విప్రుతుల్ | విప్రుతుఁ |
| 48 | 9 | పరికించు | బరికించు |
| 52 | 1 | సజ్జను | సజ్జను |